# సులభ మార్గము

పూర్వం ఒక పవిత్ర నగరములో ఒక పర్వదినము రోజు ప్రపంచ సర్వమత సమ్మేళనము జరుగుచుండెను. అందు మతపెద్దలందరు అనేక ముక్తి మార్గముల గురించి చర్చించిరి. కాని కొన్ని విషయములు వారికి సందేహములుగ మిగిలిపోయెను. ఆ రాత్రి వారందరు సకల మత ప్రార్థనలు చేసి పవళించిరి. ఆశ్చర్యకరముగ వారందరి సందేహములకు సమాధానముగ తెల్లవారు ఝాముగ వారందరు ఒకే రకమైన స్వప్నమును గాంచిరి. ఆ స్వప్న సారాంశ మేమనగా –

ఆకాశం మేఘావృతమయి, ఉరుములు, మెరుపులతో కూడి వుండగ, మత ప్రవక్తలందరికి శూన్యంలో ఉత్తరం వైపున ఒక దివ్య తేజస్సు కనిపించి ఆకాశవాణి ఈ విధముగ పలికెను:

"ఓ దైవదూతలారా! మీ సందేహములకు సమాధానము నేను మీకు తెలిపెదను. మీరు యావన్మందికి తెలిపి వారి పుణ్యసాధనకు తోడ్పడి 'ధర్మాన్ని' నిలపండి," అని మళ్ళీ ఈ విధముగ తెలిపెను.

"పవిత్రమైన జడపత్తి వత్తులతో ముందుగ దైవసన్నిధిలో దీపారాధన చేసి ప్రార్థించి మానవులు ఏ భాషలలో అయినను తమ బాధలను మరియు కోరికలను తెలుపుకొనిన అవి భగవంతునికి జ్యోతి మార్గమున అనగ సులభ మార్గమున చేరి కోరికలు తీరును," అని ఆకాశవాణి తెలిపి అంతర్ధానమాయెను. మరియు జడపత్తి వత్తులు విశ్వమంతయు కోట్ల సంఖ్యలో వారికి కనిపించెను.

వెంటనే మత పెద్దలందరు 'మానవ సేవయే మాధవ సేవ'గ భావించి తమ కర్తవ్యమును నెరవేర్చిరి. నేటికిని వారి వారసులు జడపత్తి వత్తుల దీపపు కాంతుల మహిమను అన్ని పుణ్య క్షేత్రములలో వివరించుచు సకల మత ఐకమత్యమును వివరించుట మనము గమనించుచునే యున్నాము. కాని నేటికిని కొందరు పవిత్రమైన జడపత్తి వత్తుల దీపపు కాంతుల విలువ తెలిసికొనలేక పోవుట విచారకరము.

— మిథునకుల



# చెప్పుకోండి చూద్దాం!

ప్రపంచంలోని మానవులందరూ తమ, తమ భాషలలో అనగా అనేక భాషలలో చేయు ప్రార్థనలన్నియు భగవంతునికి సులభముగా చేరుచున్నాయా? లేదా? లేని ఎడల సులభముగా చేరు మార్గమేమిటి? చెప్పుకోండి చూద్దాం! లేదా దయచేసి క్రింది విషయమంతయు పూర్తిగా చదవండి.

దైవ సన్నిధిలో చేయు ప్రార్థనలలో ముఖ్య అంశము దీపారాధన. దీపారాధనలో ముఖ్య భాగము 'వత్తులు.'

మానవులు 'పవిత్రమైన దీపారాధన' చేసుకొనుట కొరకు భగవంతుడు, పత్తి జాతులలో కెల్లా అరుదైన, ఉత్తమమైన 'జడపత్తి' మొక్కలను సృష్టించినాడు. ఈ మొక్కల నుంచి వచ్చిన దూదిలో తయారు కాబడినవే 'జడపత్తి వత్తులు.' ఇవి దీపారాధనకు వాడే ఇతర అన్ని రకముల వత్తుల కంటే శ్రేష్టమయినవి. ఈ జడపత్తి వత్తులతోనే దీపారాధన చేయవలయునను విషయము అనేక మత గ్రంథములలో నేటికిని ఆధార పూర్వకముగ తెలుపబడి ఉన్నది. మరియు అనేక మత సమ్మేళనములలో ఆచరించబడుచున్నది. అనేక మత ప్రార్థనాలయములలో 'జడపత్తి వత్తుల'తోనే దీపారాధన చేయుచూ, అందరికినీ 'ఈ పవిత్రమైన వత్తులతోనే దీపారాధన చేయండి' అని చెప్పుటను మనము గమనించుచునేయున్నాము.

అనగా దైవ సన్నిధిలో 5 లేక 18 జడపత్తి వత్తులలో 2 పూటల దీపారాధన చేసి ప్రార్థించుట వలన మానవుల బాధలు మరియు కోరికలు సులభముగ జ్యోతి మార్గమున భగవంతునికి చేరి సకల సౌభాగ్యాలతో నిండు నూరేళ్ళూ జీవించి, వృద్ధాప్యంలో భగవంతునిలో ఐక్యమగుదురు. (దీపారాధనకు వాడు వత్తుల సంఖ్య వారి, వారి ఆచారము ప్రకారము).

గమనిక: వైద్యశాలలలో గాయములు శుభ్రము చేయుటకు, మరియు నిదురించుటకు కావలసిన పరుపులు తయారు చేయుటకు వాడు సాధారణ జాతి దూది మరియు ఇలాంటి దూదితో తయారు చేసిన వత్తులు ప్రస్తుతం బజార్లలో అనేక చోట్ల విక్రయించుచున్నారు. రసాయనాలు కలిసి వున్నందున ఇవి మరీ తెల్లగా వుంటాయి. కాని దీపారాధన కొరకు మాత్రమే సృష్టించబడిన జడపత్తి వత్తులతో మాత్రమే దీపారాధన చేయండి, పవిత్రతను కాపాడండి.

ఇప్పటికీ కొందరు భక్తులు ఈ విషయము తెలియక సాధారణ వత్తులతోనే దీపారాధన చేయుట విచారకరము.

ఉత్పత్తిదారులమయిన మానుంచి, వినియోగదారులయిన మీరు సరకును నేరుగా దిగుమతి, చేసుకొనుచున్నందున నాణ్యమైన జడపత్తి వత్తులను తక్కువ ధరలకు పొందగలుగుచున్నారని మనవి చేయుచున్నాము. మా వ్యాపార లైసెన్స్ R.C. నెం NRE 10-2-1439.

ఈ ప్రకటన గల ఈ 'చందమామ' సంచికను భద్రపరచి మా చిరునామా మరియు వివరములు, బంధుమిత్రులందరికి తెలుపు వారు సొంత దీపారాధనలకే కాక, ఇతర రాష్ట్రాలలోను, విదేశాలలోను గల తమ, తమ బంధుమిత్రులకు 'అతి పవిత్రమైన బహుమానము' లుగా ఈ జడపత్తి వత్తులను ఇచ్చు ఉద్దేశంతో మాకు భారీ ఆర్డర్లు పంపుతున్నవారు, మరియు అన్ని మతముల ప్రార్థనాలయములకు, బీదభక్తులకు ఉచితముగా ఇచ్చుటకుగాను, మాకు

Advt



Continued on page 8




# చందమామ

సంస్థాపకుడు: 'చక్రపాణి' సంచాలకుడు: బి. నాగిరెడ్డి



## అమ్మకానికి తాజ్‌మహల్!

పై శీర్షికను మీరు నమ్ముతున్నారా? నమ్మలేరు. పైగా ఇదేదో తమాషాగా చెప్పుకున్న హస్యోక్తి అని మీరు అనుకున్నా ఆశ్చర్యం లేదు. ఎందుకంటే – ఈనాడు ఒక్క భారతదేశం మాత్రమే కాదు; యావత్ మానవజాతి తాజ్‌మహల్‌ను అరుదైన వారసత్వంగా భావిస్తున్నది. తాజ్‌మహల్ పరిరక్షణకు భారత ప్రజలతో పాటు యునెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలు అవసరమైన జాగ్రత్తలన్నీ తీసుకోవడానికి సిద్ధంగా ఉన్నాయి.

ఇదీ ఈనాటి పరిస్థితి. కాని వంద సంవత్సరాలకు పూర్వం పరిస్థితి వేరు. 1857వ సం॥లో జరిగిన సిపాయిల తిరుగుబాటును అణచడానికి ఈస్ట్ ఇండియా కంపెనీ ఎంతగానో పోరాడవలసి వచ్చింది. అందుకు చాలా ధనవ్యయం కూడా జరిగింది. ఆ నష్టాన్ని భర్తీ చేయడానికి తాజ్‌మహల్‌ను పగులగొట్టి అందులోని విలువైన చలువరాళ్ళను అమ్ముదామన్న పథకాన్ని కూడా ఈస్ట్ ఇండియా కంపెనీ ఆలోచించింది!

ఈ ఆలోచన మరెవరికో కాదు; సాక్షాత్తు ఈస్ట్ ఇండియా కంపెనీ స్థాపించిన భారత సామ్రాజ్య గవర్నర్ జనరల్‌కే రావడం మరీ విడ్డూరం!



అదృష్టవశాత్తు ఆ ఆలోచనను అడ్డుకోగల బ్రిటిష్ అధికారులు కూడా కొందరుండడం వల్ల ఆ పథకం నెరవేరలేదు. అయినప్పటికీ గవర్నర్ జనరల్‌కు కలిగిన ఆ ఆలోచనను భారతీయ కళాఖండాల పట్ల ఈస్ట్ ఇండియా కంపెనీకి ఉన్న ఉదాసీన దృష్టికీ, నిర్లక్ష్యానికీ ఉదాహరణగా చెప్పవచ్చు.

సంపుటి: 101 మే '98 సంచిక: 3

విడిప్రతి : 6.00 సంవత్సర చందా: : 72-00



అర్డర్లు పెట్టు దాతలు వృద్ధ ఆశ్రమ నిర్వాహకులు అందరూ తమకు తెలియకనే దైవకృపను కూడా పొందుచున్నారు. విదేశియులు కూడా భారతదేశములోని తమ బంధుమిత్రుల ద్వారా మా జడపత్తి వత్తులను పొందగలుగుట సంతోషించవలసిన విషయము.

మాకు వచ్చు అర్డర్లకు వరుస క్రమములో 15 రోజుల నుంచి, 90 రోజులలోపు సరకు పంపగలము.

మాచే ఉత్పత్తి అయి, మా ద్వారానే మార్కెట్ అగు ఈ పవిత్ర జాతికి చెందిన 'జడపత్తి వత్తులు' మా వద్ద మాత్రమే లభించును. మాకు ఎలాంటి ఇతర విక్రయపు విభాగాలు లేవు.

## I. జడపత్తి వత్తుల ధరల వివరములు:-

1,018 జడపత్తి వత్తుల ధర 1 వంద రూపాయలు, 505 జడపత్తి వత్తుల ధర రూ 50 లు. అనగా 1 పవిత్రమైన జడపత్తి వత్తి ధర కేవలం 10 పైసలు మాత్రమే. కావలసిన వారు 50% మొత్తాన్ని అడ్వాన్సుగా M.O చేస్తూ ఫారంలోనే అర్డరు వ్రాయండి. V.P.P. ద్వారా సరుకు పంపుతాము. V.P.P. ఖర్చులు మా సంస్థే భరించును. 505 వత్తుల కన్న అనగా రు. 50ల కంటె తక్కువ అర్డర్లు దయచేసి పంపవద్దు.

## II. దీర్ఘకాలిక మా వినియోగ సభ్యులకు గల మంచి సదుపాయములు:-

ముందుగానే ఒకేసారి 1 వెయ్యి రూపాయలు పంపు వారికి వెంటనే 1,018 జడపత్తి వత్తులు పంపుతాము. మరియు ప్రతి 6 నెలలకు 1 సారి 1,018 జడపత్తి వత్తుల చొప్పున 20 సంవత్సరములు క్రమం తప్పక పంపుతాము. మీకు సరుకు పంపుటకు అగు పోస్టల్ ఖర్చులు మేమే భరించుతాము. రాబోవు 20 సం॥లలో జడపత్తి వత్తుల ధరలు విపరీతముగ పెరుగును. కాని మేము ఈ ఒప్పందపు ధరలకే పంపుతాము. సభ్యత్వ రశీదు పంపుతాము.

## III. తగ్గింపు ధరలు:

1 పూట దీపారాధనకు 18 వత్తుల చొప్పున 2 పూటల అనగా 36 వత్తులతో దీపారాధన చేయువారికి 1 సం॥నకు గృహము నందు నిత్య దీపారాధనకు 13 వేల 176 వత్తులు కావలెను. ఇతర దైవదర్శన వినియోగాలకు సుమారుగా 824 వత్తులు కావలసియుండును. అనగా 14 వేల వత్తులు కావలెను. తగ్గింపు ధరలతో ఒకేసారి ముందుగానే మొత్తం విలువ రు. 1,116 పంపువారికి14 వేల 18 వత్తులను వెంటనే ఒకేసారి పంపగలము. మీకు సరుకు పంపుటకు అగు పోస్టల్ ఖర్చులు మేమే భరించుతాము. ఇదే ధరలతో ఎంత భారీ అర్డరు అయినా ఫంపండి.

D.D.లు పంపువారు, జాతీయము చేయబడిన బ్యాంకులలో క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్టులు మాత్రమే పంపవలెను. దయచేసి చెక్కులు పంపవద్దు. భారీ అర్డర్లతో M.O.లు మరియు D.D.లు తీసి పంపవలసిన మా చిరునామా:-

**K. RADHAKRISHNAIAH,**
Agriculturist
H.No. 3-52, Near Sri Mahalakshmi Temple,
KODUR P.O, NELLORE Dt. A.P.,
Pin 524 002, South India.

వార్తలు-విశేషాలు:

# మన పన్నెండవ ప్రధాని

ఎంపుడు పిల్లులూ, కుక్కలూ అంటే మక్కువ కనబరుస్తూ, పంచతంత్ర కథలను అభిమాన పుస్తకంగా భావించే సుప్రసిద్ధ వ్యక్తితో మీకు స్నేహం చేయాలనిపిస్తుంది కదూ? ఆయనే మన దేశానికి పన్నెండవ ప్రధానమంత్రిగా గత మార్చి నెలలో పదవీ బాధ్యతలు స్వీకరించిన శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి. 1926వ సం॥ క్రిస్మస్ నాటి రాత్రి ఆయన జన్మించారు. అప్పుడాయన తల్లిదండ్రులు గ్వాలియర్‌లో ఒక చర్చి పక్క ఇంట్లో ఉండేవారు. తండ్రి పేరు కృష్ణ బిహారీ వాజ్‌పేయి. తల్లి కృష్ణాదేవి. తమ నాలుగవ కుమారుడూ, ఆరవ సంతానమూ అయిన ఆ బిడ్డకు తల్లిదండ్రులు 'అటల్' (స్థిరత్వం) అని నామకరణం చేశారు.

వాజ్‌పేయి తాతగారు శ్యామ్‌లాల్, ఆగ్రా సమీపంలోని బదేశ్వర్‌కు చెందినవాడు. అయినా వాజ్‌పేయి తండ్రి అధ్యాపక వృత్తిని చేపట్టి గ్వాలియర్‌కు వచ్చి స్థిరపడ్డాడు. సొంత ఇల్లు కట్టుకుని దానికి 'కృష్ణకృప' అని పేరు పెట్టాడు. ఆ ఇంట్లోనే వాజ్‌పేయి జన్మించారు.

కృష్ణ బిహారీ తన పిల్లలందరినీ ప్రేమతోనూ, క్రమశిక్షణతోనూ పెంచి పెద్ద చేశాడు. ఎవరిపట్లా పక్షపాతం కనబరచేవాడు కాదు. పిల్లలందరూ ఒకే హరికేన్ లాంతరు చుట్టూ కూర్చుని చదువుకునేవారు. తన సోదరులు మరణించినప్పటికీ ఇప్పుడు కూడా దీపావళి, రక్షాబంధన్ వంటి పండుగల సందర్భంగా గ్వాలియర్‌లోని దాదాపు డెబ్బైమంది గల తన కుటుంబ సభ్యులతో గడపడానికే వాజ్‌పేయి ఇష్టపడతారు. ఆయన మాత్రం అవివాహితుడుగానే మిగిలిపోయారు!

తమ పిల్లలు ప్రభుత్వ ఉద్యోగం చేయాలని కృష్ణబిహారీ ఆశపడ్డాడు. పెద్ద కుమారులు ముగ్గురూ ఆయన కోరికను మన్నించి, అప్పటి బ్రిటిష్ ప్రభుత్వంలో ఉద్యోగాలు చేపట్టారు. కాని ఆఖరి కుమారుడు అటల్ మాత్రం అందుకు అంగీకరించలేదు. కాలేజీ చదువులప్పుడు



ఆయన కమ్యూనిస్టు ఆదర్శాల పట్ల ఆకర్షితుడయ్యాడు. కమ్యూనిస్టు పార్టీకి అనుబంధమైన ఆలిండియా స్టూడెంట్స్ ఫెడరేషన్‌లో సభ్యుడుగా చేరారు. కొన్నాళ్ళకు ఆయన ఆలోచనాధోరణిలో మార్పు వచ్చి రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌లో చేరారు. 1951వ సం॥లో శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ స్థాపించిన జనసంఘ్‌లో స్థాపక సభ్యులయ్యారు. 1957వ సం॥లో జనసంఘ్ అభ్యర్థిగా ప్రప్రథమంగా పార్లమెంటుకు ఎన్నికయ్యారు. 1962వ సం॥లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థి చేత ఓడిపోయినప్పటికీ 1967వ సం॥లో మళ్ళీ గెలుపొందారు. 1971, 1977 సంవత్సరాలలో ఆయన తన సొంత నియోజక వర్గమైన గ్వాలియర్ నుంచే పోటీ చేసి పార్లమెంటుకు ఎన్నికయ్యారు. 1980వ సం॥ గెలుపొంది 1984వ సం॥లో గ్వాలియర్‌లోనే ఓడిపోయారు. 1989వ సం॥లో విదిశ, లక్నో రెండు నియోజక వర్గాల నుంచి పార్లమెంటుకు ఎన్నికయ్యారు. గత ఫిబ్రవరిలో జరిగిన మధ్యంతర ఎన్నికలలో లక్నో నుంచి పార్లమెంటుకు ఎన్నికయ్యారు.

1968-'73 మధ్యకాలంలో ఆయన జనసంఘ్‌కు నాయకత్వం వహించారు. కాని 1975-76 అత్యవసర పరిస్థితికి తరవాత తన అనుచరులతో సహా జనతా పార్టీలో చేరారు. 1977వ సం॥లో జనతా పార్టీ ఘన విజయం సాధించడంతో కేంద్రంలో ప్రప్రథమంగా కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పడింది. ప్రధానమంత్రి మొరార్జీ దేశాయ్ మంత్రిమండలిలో వాజ్‌పేయి విదేశాంగ శాఖ మంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టి సమర్థవంతంగా నిర్వహించారు. ముఖ్యంగా ఇండో-పాక్ యుద్ధానంతరం (1971) దెబ్బ తిన్న ఇండో-పాక్ మైత్రిసంబంధాలను మెరుగుపరచడానికి ఆయన కృషి చేశారు. ఆ కాల ఘట్టంలోనే ఐక్యరాజ్య సమితి సర్వ సభ్య సమావేశంలో హిందీలో ఉపన్యసించి రికార్డు సృష్టించారు.

1980వ సం॥లో కాంగ్రెస్ మళ్ళీ అధికారానికి వచ్చాక, ప్రతిపక్షంలో వున్న వాజ్‌పేయి భారతీయ జనతా పార్టీని స్థాపించి దాని ప్రథమ అధ్యక్షుడయ్యారు.

1994వ సం॥లో ఉత్తమ పార్లమెంటేరియన్‌గా గోవింద వల్లభ పంత్ అవార్డుతో ప్రభుత్వం ఆయన్ను సత్కరించింది. శక్తివంతమైన వక్తగా, ప్రజ్ఞాపాండిత్యాలు గల రాజకీయవేత్తగా, నిస్వార్థ సామాజిక సేవకుడిగా; సాహితీవేత్త, కవి, పత్రికా రచయిత ఇలా బహుముఖ ప్రజ్ఞాశాలిగానూ — అన్నిటికీ మించి ప్రముఖ జాతీయ నాయకుడిగానూ ప్రశంసాపత్రం పేర్కొన్నది.

1996వ సం॥లో వాజ్‌పేయి భారతదేశం తొమ్మిదవ ప్రధానమంత్రిగా పదవి చేపట్టినప్పటికీ అది పదమూడు రోజుల ముచ్చటే అయింది. ఇప్పుడాయన మన పన్నెండవ ప్రధానమంత్రిగా మార్చి 19వ తేదీ పదవీ ప్రమాణస్వీకారం చేశారు.

భగవద్గీత, రామచరిత్ మానస్ వాజ్‌పేయి అభిమాన గ్రంథాలు. నిజాయితీగా జీవించడం ఆయన ఆదర్శం. భారతదేశాన్ని గొప్ప దేశంగా తీర్చిదిద్దడం ఆయన ఆకాంక్ష!

నూతన ప్రధానికి శుభాకాంక్షలు తెలియజేస్తున్నాం!




# వల్లకాడులో పిల్లపిశాచం

నా అనేవాళ్ళు లేని రామేశం పుట్టుగూని. వాడికి తాతలనాటి పూరిల్లొకటున్నది. కారప్పూస, జంతికలు, చేగోడీలు చేసి, నాలుగు వీధులూ తిరిగి అమ్ముకుని పొట్టపోసుకునేవాడు.

ఇలా వుండగా — ఏవో కారణాలవల్ల, రామేశం ఇంటి పక్కిల్లు అమ్మకానికి వచ్చింది. నగరంలో వ్యాపారం చేసి దివాళా తీసిన రంగనాథం ఆ ఇల్లు కొన్నాడు. ఆయనకు ఆ ఊళ్ళో నాలుగెకరాల పొలం వున్నది. ఇరవైఏళ్ళనాడు దానిని కౌలుకిచ్చి, వ్యాపారం చేయాలని పట్నం వెళ్ళిపోయాడు. ఇప్పుడు సొంత వ్యవసాయం చేద్దామని తిరిగి వచ్చాడు.

ఆయన వచ్చిన మర్నాడే, పెరట్లో గాడి పొయ్యి పెట్టి జంతికలు చేస్తున్న రామేశం గురించి అడిగి తెలుసుకున్నాడు. ఆయనకు ఇద్దరు కూతుళ్ళు. రంజని మొదటి భార్య కూతురు. ఆమెకు రెండేళ్ళ వయసుండగా భార్య పోవడంతో, కనకం అనే ఆవిడను చేసుకున్నాడు. ఆమె కూతురు మంజరి.

ఒకనాడు రంగనాథం, రామేశంతో, "బాబూ! పెళ్ళికెదిగిన ఇద్దరు కూతుళ్ళు, నా గుండెల మీద నీ గాడిపొయ్యిలా వున్నారు!" అంటూ తన కుటుంబం గురించి చెప్పుకున్నాడు.

రంజనిది సహజ సౌందర్యం, కోకిల కంఠం ఆమెకు దేవుడిచ్చిన వరం. పెరట్లో రకరకాల మొక్కలు పెంచిన ఆమె, ఆ మొక్కల మధ్య తిరుగుతూ తీయగా పాడుతూండేది. ఏమాత్రం అందచందాలు లేకపోయినా మంజరికి అలంకరణల పట్ల ఆసక్తి ఎక్కువ, పని అంటే రోత. ఆమె రోజులో ఎక్కువ భాగం అద్దం ముందు కూర్చుని, తనకు

మాచిరాజు కామేశ్వరరావు



లేని అందాలకు మెరుగులు దిద్దుకుంటూండేది.

పెరట్లో గాడి పొయ్యి దగ్గర పని చేసే రామేశానికి, రంజని తీయని పాటలు వింటూంటే అలసట తెలిసేది కాదు. విసుగు పుట్టేది కాదు. వాడు మునుపటి కన్నా ఎక్కువగా జంతికలూ, చేగోడీలూ చేసి నాలుగు డబ్బులు వెనకవేసుకున్నాడు. కాస్త డబ్బు పోగుపడగానే వాడికి పెళ్ళి మీదికి ధ్యాస మళ్ళింది. రంజనిని భార్యగా చేసుకుంటే తనను మించిన అదృష్ట వంతుడుండడు. అయితే, తన అంగ వైకల్యం వల్ల, రంజనితో పెళ్ళి ప్రస్తావన తెచ్చే ధైర్యం లేకపోయింది వాడికి.

ఉన్నట్టుండి రంగనాధం గుండె జబ్బుతో మంచం పట్టాడని తెలిసి, రామేశం ఆయన్ను చూడబోయాడు. రంగనాధం చాలా నీరసపడి వున్నాడు. ఆయన రామేశంతో, "కనీసం పెద్దపిల్ల పెళ్ళయినా కళ్ళ చూస్తానన్న ఆశలేదు. కట్నం కోరకపోతే, ఏ కుంటివాడికో అయినా ఇచ్చి చేస్తాను. అటువంటి వాళ్ళు కూడా కనిపించడం లేదు!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

"మీకూ, మీ రంజనికీ అభ్యంతరం లేకపోతే, ఆమెను నేను చేసుకుంటాను," అన్నాడు రామేశం.

ఆ మాటలకు పొంగిపోయిన రంగ నాధం, అప్పటికప్పుడు భార్య కనకాన్ని పిలిచి, ఆ సంగతి చెప్పాడు.

"ఇప్పుడు పెళ్ళి కబుర్లు దేనికి? కళ్ళు మూసుకుని పడుకో," అన్నది కనకం మూతి తిప్పుతూ.

అప్పుడు కళ్ళు మూసుకున్న రంగ నాధం మళ్ళీ కళ్ళు తెరవలేదు.

రంగనాధం పోయిన మూడు మాసాల తర్వాత, రంజనితో తన పెళ్ళి విషయం కనకం దగ్గర ప్రస్తావించాడు రామేశం.

రంజనికి పెళ్ళి చేస్తే డబ్బు దండగ. పైగా ఇంటి చాకిరీ ఎవరు చేస్తారు? ఇలా అను కుని కనకం, ఒక పథకం ఆలోచించి రామేశంతో, "చూడు, బాబూ! మా రంజని చీకటి తోటే లేచి, బంగారు గన్నేరు పూలతో అమ్మ వారికి పూజ చేసుకుంటూంది. అర్ధరాత్రివేళ వికసించే ఆ పూలచెట్లు, అడవి మధ్య పాడు బడిన శివాలయం ఆవరణలో వున్నాయి. వాళ్ళ నాన్న బతికి వున్నన్నాళ్ళూ, అక్కడికి వెళ్ళి పూలు తెచ్చిపెట్టేవాడు. అసలే గూనివాడివి, రాత్రివేళ అంతదూరం వెళ్ళిరాగలవా?" అన్నది.

రంజని మీద అమితమైన ప్రేమ వున్న రామేశం వెంటనే, "అదెంత పని!" అనేశాడు.

"అయితే, రాత్రివేళ ఆ గన్నేరుపూలు తీసుకురా!" అన్నది కనకం.

అడవిలో ఏ పులో రామేశాన్ని పీక్కు తింటుందనీ, ఆ విధంగా వాడి బాధ విరగడ అవుతుందనీ, కనకం ఆశపడింది.

ఆ రోజు రాత్రి రామేశం అడవిలోకి బయలుదేరాడు. వాడు పాడుబడ్డ శివాలయాన్ని వెతుక్కుంటూ పోగాపోగా, ఒక చోట శివాలయం, దాని ముందు బంగారు గన్నేరు చెట్లూ కనిపించాయి. వాడు దోసెడు పూలు తుంచి, పై బట్టలో మూట గట్టుకుని వెనుదిరిగి కొంత దూరం వచ్చేసరికి, ఒక పెద్ద మర్రిచెట్టు వెనక నుంచి పెద్దగా వెక్కిళ్ళు వినిపించినై.

రామేశం ఆశ్చర్యపడుతూ చెట్టు వెనక్కు వెళ్ళాడు. అక్కడ ఒక బండరాయి మీద జుట్టు విరబోసుకుని కూర్చున్న పిల్లపిశాచం ఒకటి కనిపించింది. దాన్ని చూసి రామేశం కెవ్వుమన్నాడు. పిల్లపిశాచం మరింత పెద్దగా రెండుసార్లు ఖెవ్వు, ఖెవ్వుమన్నది.

పిల్లపిశాచం తనను చూసి బెదిరిందని గ్రహించిన రామేశం, ధైర్యం తెచ్చుకుని, అభయం ఇస్తున్నట్టు చేయెత్తి, "ఓయీ, భయపడకు! కండకావరంలో వున్న పెద్ద పిశాచాలకు తప్ప, పిల్లపిశాచాలకు నేనెటువంటి హానీ కలిగించను. అట్లని నేను, నాకు మంత్రతంత్ర విద్యలు నేర్పిన గురువుగారి దగ్గర ఒట్టు పెట్టుకున్నాను. సరే, ముందు నీ దుఃఖకారణం ఏమిటో చెప్పు," అని అడిగాడు రామేశం.



"మరేం లేదు, పెద్ద పిశాచాలు వద్దంటున్నా వినక, అడవిలోకి బయలుదేరి దారి తప్పాను. ఇప్పుడు నేనుండే వల్లకాడుకు దారెటో తెలియడంలేదు. నాకు మనుషులంటేనే మహాచెడ్డ భయం!" అన్నది పిల్లపిశాచం కళ్ళు తుడుచుకుంటూ.

"అలాగా! నేను ఊళ్ళోకి వెళుతున్నాను, నాతో రా. ఆ వల్లకాడు దగ్గర వదులుతాను," అన్నాడు రామేశం.

పిల్లపిశాచం లేవబోయి, రాతిమీద చతికిలబడి, "రెండు జాములుగా అడివంతా కాళ్ళరిగేలా తిరిగాను, నడవలేను," అన్నది.

ఆ మాటలకు రామేశం పెద్దగా నవ్వి, "సరే, ఇకనుంచి అడవిలో కాళ్ళకు చెప్పులు లేకుండా తిరగకు," అంటూ పిల్లపిశాచం చేతికి గన్నేరు పూలమూటను ఇచ్చి,



దాన్ని భుజాన వేసుకుని గ్రామంకేసి బయలుదేరాడు.

కొంత దూరం వెళ్ళేసరికి, ఒక చెట్టు కింద దొంగలిద్దరు బంగారు కాసులు కుప్పగా పోసి పంచుకుంటున్నారు. వాళ్ళు గూనివాడి భుజం మీద జుట్టు విరబోసుకుని వున్న పిల్లపిశాచాన్ని చూసి హడలిపోయి, పిచ్చిగా అరుస్తూ అక్కణ్ణించి పారిపోయారు.

రామేశం, వాళ్ళు వదిలిపోయిన కాసుల్ని అక్కడ వున్న తోలు సంచీలో వేసి భుజానికి తగిలించుకుని అమితోత్సాహంతో నడక సాగించాడు.

వాళ్ళు వల్లకాడుచేరగానే, అక్కడ గుంపుగా కూడి పిల్లపిశాచం ఏమైందా అని ఆందోళన పడుతున్న పెద్ద పిశాచాలు, రామేశం భుజం మీద వున్న పిల్లపిశాచాన్ని చూసి కేరింతలు కొడుతూ, వాళ్ళ ముందుకు వచ్చాయి. రామేశం, పిల్లపిశాచాన్ని కిందికి దించాడు.

ఆశ్చర్యం! పుట్టుకతో వచ్చినవాడి గూని మటుమాయమైంది. నిటారుగా నిలబడ్డాడు. పిశాచాలు చప్పట్లు చరుస్తూ, "మా ముద్దుల పిల్లపిశాచాన్ని భద్రంగా ఇక్కడికి తెచ్చినందుకు, మా బహుమతి!" అన్నాయి.

రామేశం వాటికి తన కృతజ్ఞతలు చెప్పుకుని ఇల్లు చేరాడు. పిల్లపిశాచి కారణంగా, తనకు గూనిపోయిందని చెబితే కనకం భయపడుతుందని, "అడవిలో శిథిలమై పోతున్న శివాలయం మహత్తు ఎవరికీ తెలిసినట్టు లేదు! నేనలా ఆలయ ప్రాంగణంలో అడుగు పెట్టగానే గూని పోయింది, బంగారు కాసుల సంచీ దొరికింది," అన్నాడు.

తర్వాత వాడు, అక్కడే వున్న రంజనికేసి చూస్తూ, "ఈమెతో పెళ్ళి తలపెట్టగానే ఇంతగా కలిసివచ్చిన నాకు, పెళ్ళే జరిగితే మరెంత కలిసివస్తుందో!" అన్నాడు.

ఆ మాటలకు రంజని సిగ్గుపడి తలుపు చాటుకు తప్పుకున్నది.

సవతి కూతురుకు పట్టిన అదృష్టానికి, కనకం ఈర్ష్యతో కుమిలిపోయింది. ఆ సాయంత్రంపెరట్లో పచార్లు చేస్తూన్న రామేశంతో, ఆమె, "చూడు బాబూ! రంజనికి నిన్ను చేసుకోవడం ఇష్టంలేదట! దాని ఆలోచనలు ఏ రాకుమారుడో, జమీందారు పెద్ద కొడుకో అన్నట్టున్నవి. నా కూతురు మంజరికి నువ్వంటే పంచప్రాణాలు; దాన్ని చేసుకో, కలకాలం సుఖపడి పోగలవు," అన్నది.

"అలాగా! అయితే నన్ను కాస్త ఆలోచించుకోనివ్వు," అన్నాడు రామేశం.

వాడికి కనకం అబద్ధాలు చెబుతున్నదని అనుమానం కలిగింది.

ఆ రాత్రి ఎవరో తలుపు తట్టడంతో, రామేశం వెళ్ళి తలుపు తీశాడు. పిల్ల పిశాచం చొరవగా లోపలికి వస్తూ, "నేను ఇదే మొదటిసారిగా గ్రామంలోకి రావడం. నిన్ను చూశాక, మనుషులంటే భయం పోయింది!" అన్నది.

గన్నేరుపూలు మూటగట్టిన రామేశం పైపంచ దాని దగ్గరే వుండిపోయింది. ఆ పంచ ఇచ్చి వెళదామని వచ్చింది పిల్ల పిశాచం. రామేశం దానికి ఒక పళ్ళెంలో కారప్పూస, చేగోడీలు వేసి ఇచ్చి, "వీటిని రుచి చూడు!" అన్నాడు.

"వీటిని ఏమంటారు?" అని అడిగింది పిల్లపిశాచం.

తన పెళ్ళి ఆలోచనలతో బుర్ర వేడెక్కిన రామేశం, దాని ప్రశ్న సరిగా వినకుండానే, "రంజని! మంజరి! అంటారు," అనేశాడు.

ఇంతలో పక్కింట్లో అలికిడికి నిద్ర లేచిన కనకం, తలుపు తీసుకుని బయటికి వచ్చి, "ఇంత రాత్రివేళ, ఎవరా వచ్చింది?" అంటూ కేకపెట్టింది.

రామేశం కంగారుపడుతూ బయటకు వచ్చి, "మా వేలు విడిచిన మేనమామ కూతురు, అత్తయ్యా! ఆవిడకు రాత్రుల్లో తప్ప, పగటిపూట ప్రయాణాలంటే ఇష్టం వుండదు! రంజనీ, మంజరీల్లో ఎవరిని చేసుకుంటే మేలు కలుగుతుందని ఆమె నడుగుతున్నాను," అని, ఇంకా అక్కడ వుంటే కనకం ఏం ప్రశ్నలు వేస్తుందో అని, గబగబా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ జవాబు నమ్మని కనకం కిటికీ లోంచి లోపలికిచూసింది. ఆ సమయంలో పిల్లపిశాచం, పళ్ళెంలో వున్న కారప్పూస, చేగోడీలకేసి చూస్తూ, "సన్నగా వున్న రంజని వద్దు, లావుగా వున్న మంజరినే తింటాను," అంటున్నది.

ఆ మాట విన్న కనకం నిలువెల్లా వణికిపోతూ ఇంట్లోకి పరిగెత్తింది. తెల్లవారగానే ఆమె, రామేశంతో, "బాబూ! నీ మనసు రంజని మీదే వున్నట్టుంది. నీ ఇష్ట ప్రకారమే ఆమెతో, నీ పెళ్ళి జరిపిస్తాను," అన్నది.

ఆ తర్వాత వారం తిరక్కుండా రంజనితో రామేశం పెళ్ళి జరిగిపోయింది.



# పలుకుబడి

చంద్రావతి నగరంలో నివసించే భీమయ్యకు ఒకే ఒక్క కొడుకు. అతని పేరు గోపయ్య. కష్టపడి బాగా చదివించినా గోపయ్యకు ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. అదే పెద్ద దిగులయింది భీమయ్యకు.

ఒకనాడు కొడుకును వెంటబెట్టుకుని వెళుతూన్న భీమయ్యకు, ఆస్థాన పండితుడు రామశర్మ ఎదురుపడి, "బాగున్నావా, భీమయ్యా!" అని ఆప్యాయంగా పలకరించాడు.

"ఏం బాగోలెండి, అయ్యగారూ! మావాడికి పాతికేళ్ళు నిండినా ఇంకా ఉద్యోగం దొరకలేదు.అదే నా బాధ. రాజుగారి దగ్గర మీ మాట చెల్లినప్పుడేమో మావాడింకా ఎదిగి రాలేదు. అంతా మా అదృష్టం. ఏం చేస్తాం?" అంటూ నిరాశగా బదులిచ్చాడు భీమయ్య.

రామశర్మ తల ఊపి మరేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

నెల తిరక్కుండానే గోపయ్యను ఉద్యోగంలో చేరమని రాజాస్థానం నుంచి కబురు అందింది. ఒకనాడు గోపయ్య తండ్రితో, "రామశర్మ దయవల్లే నాకీ ఉద్యోగం వచ్చింది. రాజుగారి దగ్గర పలుకుబడి వున్నా ఆయన దాన్ని ఎవరి కోసమూ ఉపయోగించడని ప్రతీతి. అలాంటి నిక్కచ్చి మనిషి నా ఉద్యోగం కోసం ఎలా సిఫారసు చేయగలిగాడో నాకు అర్థం కావడంలేదు," అన్నాడు.

అందుకు భీమయ్య నవ్వి, "అదేరా లౌక్యమంటే. రానురాను రాజుగారి దగ్గర రామశర్మ పలుకుబడి తగ్గిపోతోందన్న అనుమానాన్ని కలిగించాను. అంతే! తనకు ఇష్టం లేకపోయినా, తన పలుకుబడి తగ్గిపోలేదని నిరూపించుకోవడానికి, నీకు ఉద్యోగం ఇప్పించక తప్పలేదు అయనకు!" అని జవాబిచ్చాడు.

—బి. రఘురామరాజు





# సామ్రాట్ అశోక

15

[కళింగ యుద్ధం ముగిసింది. విజయోత్సాహంతో అశోకుడు, తన మిత్రుడైన యశుణ్ణి కళింగ ప్రాంతానికి రాజప్రతినిధిగా నియమించాలనుకున్నాడు. కాని, యశుడు అంతలోనే చాటు నుంచి ఒక యువతి వేసిన బాణానికి హతుడయ్యాడు. యశుడు ప్రాణం వదులుతూ తనపై బాణం వేసిన యువతిని శిక్షించవద్దని చెప్పాడు. మిత్రుడి మరణం అశోకుణ్ణి తీవ్రమైన మనోవ్యధకు గురి చేసింది. ఆప్తమిత్రుడి మరణం గురించీ, అమాయకుల ప్రాణాలను బలిగొన్న కళింగ యుద్ధం గురించీ అశోకుడు విచారగ్రస్తమైన హృదయంతో తీవ్రంగా ఆలోచించసాగాడు. — తరవాత]

**తో**శాలీ నగర రాజభవనంలోని శవాలన్నిటినీ తొలగించారు. గడ్డ కట్టుకుపోయిన నెత్తురు మరకలతో నిండిన నేల — బలమైన వానజల్లు పడడంతో పరిశుభ్రమయింది. కాని రాజభవనంలోని ఒక విశాల మంటపంలో కూర్చున్న అశోకుడి మనసు మాత్రం రకరకాల ఆలోచనలతో సుడులు తిరగసాగింది. యశుడికి తగిలిన బాణం తనకు తగిలి వుంటే పరిస్థితులు ఎలా వుండేవని అశోకుడు తీవ్రంగా ఆలోచించసాగాడు. బాణం దెబ్బకు మరణించకుండా తప్పించుకున్నప్పటికీ, ఆయన మనసు మాత్రం ప్రాణం కోల్పోతున్నట్టు విలవిలలాడసాగింది. తనజీవితంలోని కీలకమైన వివిధ ఘట్టాలలో, ఆపద సమయాలలో తనకు అండగా నిలిచిన ఆప్తమిత్రుడు యశుడు — జీవితంలో విడదీయలేని భాగంగా



ఉండేవాడు. అటువంటి స్నేహితుడే లేడన్నప్పుడు తను సాధించిన విజయం ఎందుకు? జీవితంలో విజయానికున్న స్థానం ఎంత? విజయం అంటే ఏమిటి? ఎప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా సర్వం శూన్యంగా మారిపోయే మానవ జీవితానికి అసలు ఒక అర్థం అంటూ వుందా? యశుడు తన ప్రతినిధిగా కళింగను పరిపాలించగలడని తాను కలలు గన్నాడు. కాని ఒకవైపున రాజ్యంలో తన సైనికులు రగిల్చిన మంటలు ఆరకముందే, అతడి భౌతికకాయం దయానదీ తీరంలో మంటలకు ఆహుతై, పిడికెడు బూడిదగా మారిపోయింది!

సేనాధిపతి అక్కడికి రాగానే ఆలోచనల నుంచి బయటపడిన అశోకుడు, "ఉజ్జయినికి దూతలను పంపావా?" అని అడిగాడు.

"పంపాను ప్రభూ! తమరు సాధించిన కళింగ విజయాన్నీ; యుద్ధానంతరం యశుడు మరణించిన విషాద ఉదంతాన్నీ మహారాణిగారికి తెలియజేయమని దూతలను పంపాను!" అన్నాడు సేనాధిపతి.

"మనం సాధించిన విజయం ఆమెకు ఎలాంటి సంతోషాన్నీ కలిగించదు. కాని యశుడి మరణవార్త మాత్రం ఆమెకు పిడుగుపాటులా దిగ్భ్రాంతిని కలిగించక మానదు. అతడు ఆమెకు నిజమైన సోదరుడుగా, రక్షకుడుగా ఉండేవాడు!" అన్నాడు అశోకుడు విచారంగా.

"శాంతిని కాంక్షించే రాజ్యం మీదికి నిష్కారణంగా నువ్వు జరిపిన దండయాత్ర కారణంగా ఎందరెందరో స్త్రీ పురుషులు తమ సోదరులనూ, పిల్లలనూ, రక్షకులనూ, భర్తలనూ పోగొట్టుకున్నారు కదా? వాళ్ళను గురించి కూడా కొంచెం ఆలోచించు, మహారాజా!" అంటూ వెలుపలి నుంచి ఒక స్త్రీ కంఠస్వరం వినిపించింది.

సేనాధిపతి వెనక్కు తిరిగి చూస్తూ, "నోర్మూయ్, పిచ్చిదానా!" అని గట్టిగా హెచ్చరించాడు.

తన బాణం దెబ్బతో యశుణ్ణి హతమార్చిన ఆ యువతి చేతులకు సంకెళ్ళతో అశోకుడి ఎదుటికి వచ్చి నిలబడింది.

"తమరే శిక్ష విధిస్తారో తెలుసుకోవాలని, ఆ దుర్మార్గురాలిని మీ సమక్షానికి లాక్కు వచ్చాను," అన్నాడు సేనాధిపతి.

అశోకుడు అమితాశ్చర్యంతో ఆ యువతికేసి కన్నార్పకుండా చూడసాగాడు.

"నేను మూయకపోయినా, మీరు శాశ్వతంగా నా నోరు మూయిస్తారు. మీ ఇష్టానుసారమే కానివ్వండి. కాని ఆ పని చేసే ముందు నా మాటలు కూడా విని కాస్త నెమ్మదిగా ఆలోచించండి. పిచ్చి ఎవరికి? అధికార దాహంతో వేలాది గృహాలను నాశనం చేసి లక్షలాది అమాయక ప్రజలను హతమార్చిన వాళ్ళకా? లేక తమ ప్రజలకు జరిగిన దురన్యాయానికి ఆగ్రహించి ప్రతీకార చర్యకు ప్రయత్నించిన వారికా? ఎవరికి ఉన్మాదం? ఆలోచించండి! నేనొక సామంతుని కుమార్తెను. మీ కారణంగా జరిగిన యుద్ధంలో నా తండ్రీ, సోదరులూ, మా అక్క భర్తా ప్రాణాలు కోల్పోయారు. ఆ దుఃఖాన్ని భరించలేక మా తల్లీ, అక్కా ఆత్మహత్య చేసుకున్నారు. ఇది కేవలం నా వ్యక్తిగతమైన విషాదం! నువ్వు ప్రశాంతమైన మా రాజ్యానికి తలపెట్టిన హాని గురించి ఆలోచించావా? దృఢకాయులందరూ మరణించారు. లేదా బందీలుగా పట్టుబడ్డారు. దాని ఫలితంగా తరతరాలుగా దూరతీరాలతో నిరంతరాయంగా సాగిన మా నౌకా వర్తక వ్యాపారాలు అంతరించిపోయాయి. శ్యామల వర్ణంతో ఆకాశాన్ని చూసి నవ్వే వరిపొలాలు ఇకపై వాటిని చూసే దిక్కులేక మలమల మాడిపోక తప్పదు. రాజ్యంలో కరువు తాండవిస్తుంది. చావగా మిగిలిన స్త్రీలు, పిల్లలు, వృద్ధులు ఆకలి చావులకు గురికాక తప్పదు.



వీటంతటికీ కారణం ఏమిటి? నీ రాజ్యకాంక్ష! విజేతగా నీకు నీవాళ్ళు జేజేలు పలకాలి! మిగిలిన రాజులు నిన్ను చూసి భయంతో గడగడలాడాలి! నీచమైన ఈ పేరాశతో నువ్వు యుద్ధానికి పాల్పడడమే ఈ అనర్థాలన్నిటికీ మూలం!" అంటూ ఇంకా ఏదో చెప్ప సాగిందా యువతి.

"చాలు, ఆపు!" అని గట్టిగా అరుస్తూ సేనాధిపతి తన కత్తి మీద చేయివేశాడు.

"ఆగు, సేనాధిపతీ! ఆమెను మాట్లాడనివ్వు!" అన్నాడు అశోకుడు.

సేనాధిపతి నివ్వెరపోయి మౌనం వహించాడు.

ఆ యువతి మళ్ళీ, "నీ సైనికుల చేత హతులైన నా ప్రజలు వెళ్ళిన చోటికి ఈ



రోజు కాకపోయినా ఎప్పుడో ఒకప్పుడు నువ్వు వెళ్ళక తప్పదు కదా! నాకు పరలోకం గురించి తెలియదు. ఒకవేళ వాళ్ళందరూ నీకోసం ఎదురు చూస్తున్నారనే అనుకుందాం. అప్పుడు నీ గతి ఏమవుతుందో ఆలోచించావా? వాళ్ళందరూ ఒక్కసారిగా నీ మీదికి ఉరికితే ఏం చెయ్యగలవు? ఇక్కడి సేనాధిపతినీ, అంగరక్షకులనూ వెంటబెట్టుకుని వెళ్ళలేవు కదా? ఆయుధాలు పదును పెడుతూన్న నా తండ్రినీ, సోదరులనూ నీ సైనికులు దొంగచాటుగా వచ్చి హతమార్చేశారు. వాళ్ళే నీకక్కడ మొట్టమొదట స్వాగతం పలకాలని ఆశిస్తున్నాను!" అంటూ భవనం ప్రతిధ్వనించేలాగా బిగ్గరగా పకపకా నవ్వసాగింది.

"ప్రభూ! ఆ పిచ్చిదాని వాగుడు అంతం చేయడానికి నన్ను అనుమతించండి!" అన్నాడు సేనాధిపతి.

అశోకుడు తల అడ్డంగా ఊపి, లేచి మౌనంగా ఆ యువతిని సమీపించి, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"కారువాకి!" అన్నదా యువతి.

"కారువాకీ! నువ్వే నా స్థానంలో వుంటే ఏం చేసేదానివి?" అని అడిగాడు అశోకుడు.

"నిష్ప్రయోజనమైన కీర్తికాంక్షనూ, మృగప్రాయమైన రక్తదాహాన్నీ ఈ క్షణమే వదిలిపెట్టేదాన్ని. చేసిన దుష్కార్యాలకు పశ్చాత్తాపం చెందేదాన్ని. ఆయుధాలను పరిత్యజించి, హింసను మానవులు నిర్జించవలసిన పరమహీన గుణంగా ప్రకటించేదాన్ని!" అన్నది కారువాకి ఏమాత్రం తొణకని దృఢమైన కంఠస్వరంతో.

అంతలో అశోకుడి ప్రధాన అంగరక్షకుడు అక్కడికి వచ్చి, "ప్రభూ! ఉజ్జయిని నుంచి దూత వచ్చాడు!" అని చెప్పాడు.

"లోపలికి తీసుకురా!" అన్నాడు అశోకుడు.

వెలుపలికి వెళ్ళిన అంగరక్షకుడు దూతను వెంటబెట్టుకుని మరుక్షణమే లోపలికి వచ్చాడు.

"శ్రీకరా! సరైన సమయానికి వచ్చావు. ఉజ్జయినిలో రాణీ, పిల్లలూ క్షేమంగా ఉన్నారు కదా?" అని అడిగాడు అశోకుడు దూతను.

"ప్రభువులు క్షమించాలి! ఇటువంటి ఘోరమైన వార్తతో తమరిని చూడవలసి వస్తుందని నేనెప్పుడూ ఊహించలేదు!" అన్నాడు శ్రీకరుడు తలవంచుకుని.



ఫరవాలేదు చెప్పు అన్నట్టు తల పంకించాడు అశోకుడు.

"మహారాణి విదీశాదేవి మరణించారు ప్రభూ!" అన్నాడు శ్రీకరుడు గద్గద స్వరంతో.

"హతవిధీ! ఏమిటి నువ్వనేది?" అన్నాడు అశోకుడు దిగ్భ్రాంతితో.

"ప్రభూ! వ్యాపార నిమిత్తం ఉజ్జయిని నుంచి ఇక్కడికి వచ్చిన వర్తకులు కొందరు మొదటిరోజు జరిగిన యుద్ధాన్ని కళ్ళారా చూసి హడలిపోయి ఉజ్జయినికి పారిపోయారు. ఇక్కడి భయానక సంఘటనలనూ, ప్రజలు అనుభవిస్తూన్న బాధలనూ అక్కడి వారికి తెలియజేశారు. ఆ సంగతి మహారాణికి తెలియవచ్చింది. ఆమె ఆ వర్తకులను పిలిపించి విషయం అడిగారు. వాళ్ళు జరిగినది జరిగినట్టు చెప్పేశారు. తన భర్త చేసిన దుష్కృత్యానికి తాను ప్రాయోపవేశం చేస్తానని చెప్పి, ఒక ఆలయంలోకి ప్రవేశించి నిశ్చల ధ్యానంలో కూర్చున్నారు. మూడు రోజులు నిద్రాహారాలు లేకుండా అలాగే కూర్చుని నాలుగవ రోజు స్పృహ తప్పి పడిపోయి ప్రాణాలు వదిలారు!" అన్నాడు శ్రీకరుడు.

అక్కడ కొంతసేపు నిశ్శబ్దం చోటు చేసుకున్నది. ఉన్నట్టుండి కారువాకి పకపకమంటూ నవ్వసాగింది. ఆ నవ్వు రాజభవనంలో ప్రతిధ్వనించింది.

"నవ్వడానికి ఇదా సమయం! నీకు సిగ్గులేదా?" అని గద్దించాడు సేనాధిపతి.

"సేనాధిపతీ! నా జీవితంలో నవ్వుకూ, ఏడ్పుకూ తేడా ఎప్పుడో నశించింది. అసలు వాటికి అర్థం లేదు. ఎప్పుడైనా నవ్వగలను, ఏడ్వగలను!" అంటూ కారువాకి మళ్ళీ నవ్వసాగింది.

"ప్రభూ! ఈ పాతకురాలిని లాక్కుపోయి బంధిస్తాను," అన్నాడు సేనాధిపతి.

"వద్దు. మొదట ఆమె చేతి సంకెళ్ళను తొలగించి, వదిలిపెట్టు!" అని ఆజ్ఞాపించాడు అశోకుడు.

"యశుణ్ణి చంపిన ఈ ఘాతకురాలిని విడిచిపెట్టడమా ప్రభూ!" అన్నాడు సేనాధిపతి ఆశ్చర్యంగా.

"అవును. యశుడే ఆమెను క్షమించాడు. ఆమె బాణాన్ని నా మీదికి గురి పెట్టకుండా తన పైకి వదిలినందుకు కృతజ్ఞతగా అతడా పని చేయమన్నాడు. యశుడి చివరి కోరికను మనం గౌరవించాలి!" అన్నాడు అశోకుడు గంభీరంగా.

సేనాధిపతి సంకెళ్ళు తొలగించగానే కారువాకి, "ప్రభూ! యశుడు చాలా ఉత్తముడనడానికి ఆయన చివరి మాటలే నిదర్శనం! నా కుటుంబాన్నీ, బంధు మిత్రులనూ, అమాయకులైన నా రాజ్య ప్రజలనూ హతమార్చిన మీపై పగ సాధించడానికి — మిమ్మల్నిగాని, యశుణ్ణి గాని చంపాలన్న నిశ్చయంతో విల్లును ఎక్కుపెట్టాను. బాణం వదలడానికి ముందు, మిమ్మల్ని వదిలిపెట్టాలన్న ఆలోచన నాలో ఎందుకో ఆ క్షణంలో కలిగింది. బహుశా మీవల్ల ఈ ప్రపంచానికి ఏదో గొప్ప మేలు జరగాలన్నది విధి నిర్ణయం కాబోలు!" అన్నది.

"అతి భయంకరుడుగా 'చండాశోకుడని' కళింగ ప్రజలచే ద్వేషించబడే నేను ఈ ప్రపంచానికి మేలు చేయగలనా?" అని అడిగాడు అశోకుడు విచారంగా.

"రాజా! ప్రతి మనిషిలోనూ మంచీ, చెడూ రెండూ ఉంటాయి. యశుడు దారుణమైన మరణాలకెన్నిటికో కారకుడు కాడా? అయినా తనకు మరణం సమీపించినప్పుడు ఆయనలోని, ఉన్నత మైన మానవ స్వభావం బయటపడింది కదా? అలాగే ఇప్పుడు చండాశోకుడుగా ప్రజల ద్వేషానికి గురవుతూన్న మీరు, మునుముందు ధర్మమూర్తిగా, ధర్మాశోకుడుగా ప్రజల ఆదరాభిమానాలకు పాత్రులు కావచ్చు. శాంతంగా ఆలోచించండి!" అని చెప్పి కారువాకి అశోకుడికి నమస్కరించి, భవనం నుంచి వెలుపలికి నడిచింది.

• • •



యుద్ధసమయంలో బందీలైన వారందరినీ విడుదల చేసి, తోశాలి నగరంలో సేనాధిపతిని వుంచి, అశోకుడు ఉజ్జయినికి బయలుదేరాడు. అక్కడ బూడిదగా మిగిలిన విదిశాదేవి ఆరిన చితిని చూసి సజల నయనాలతో మౌనంగా అంజలి ఘటించాడు. కుమారుడు మహేంద్రుడూ, కుమార్తె సంఘమిత్రా ఆయనకు ఇరువైపులా నిలబడ్డారు.

"మీ తల్లి నాపై ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేశాను," అన్నాడు అశోకుడు పిల్లలతో ఎంతో బాధగా.

"మీరు దానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు. ప్రతి దుష్కృత్యానికీ ఒక నిష్కృతి వుంటుంది. తథాగతుడైన బుద్ధుడి దయ మీపై ఎల్లప్పుడూ వుంటుంది!"

అంటూ గురుదేవుడు ఉపగుప్తుడు అక్కడికి వచ్చాడు.

ఆ క్షణం నుంచి అశోకుడి జీవితంలో నూతన అధ్యాయం ఆరంభమయింది. గురుదేవుల బోధకు ముగ్ధుడై, ఆయన బౌద్ధమతాన్ని స్వీకరించాడు. యుద్ధంపట్ల విముఖత పెంచుకున్నాడు. అహింసను పరమధర్మంగా పాటిస్తూ, రాజ్యంలో హింసను నిషేధించాడు. రాజ్యమంతటా శాంతి, అహింసలు నెలకొనేలాగా అక్కడక్కడ ధర్మరక్షకులను నియమించాడు.

తన రాజ్యకాంక్ష కారణంగా శిథిలమైన తోశాలి కోటకు అభిముఖంగా ధౌలీ కొండపై తన దుష్కృత్యానికి విచారం వ్యక్తం చేస్తూ శిలాశాసనం వేయించాడు. కేవలం మృగబలంతో, కత్తిమొనతో ఎటువంటి విజయాన్నీ సాధించలేము; మంచి పనులతో ప్రజాహృదయాలను ఆకట్టుకోవడం ద్వారానే శాశ్వతమైన విజయం సాధ్యం – అని తాను గ్రహించిన సత్యాన్ని ఆ శిలాఫలకం మీద చెక్కించాడు. తన శాంతి సందేశాన్ని అందులో తెలియజేశాడు.

అటువంటి సందేశాలనే రాజ్యంలో శిలాఫలాకాల మీద చెక్కించాడు. ఇరుగుపొరుగు రాజ్యాలకూ; సిరియా, ఈజిప్టు వంటి దూరదేశాలకూ పండితులైన బౌద్ధమత ప్రచారకులను పంపాడు. ఆయన కుమారుడు, కుమార్తె – మహేంద్రుడు, సంఘమిత్ర శ్రీలంకకు వెళ్ళి అక్కడి రాజునూ, ప్రజలనూ బౌద్ధమతం స్వీకరించేలా చేశారు!

అశోకుడు గొప్ప సమ్రాట్టుగా ప్రపంచ ప్రసిద్ధి గాంచాడు. ఆయన సాధించిన విజయాలూ, అధికారం మాత్రమే దానికి కారణాలు కావు. ఆయన మానవ జాతిపై చూపిన అపారకరుణ, అచంచలమైన విశ్వాసమే అందుకు కారణం. ప్రపంచ చరిత్రలో ఎందరో రాజులు ఎంతో గొప్ప రాజ్యాలు స్థాపించారు. కాని, యావత్ మానవజాతి జ్ఞానం పొంది, మానవులందరూ వివేకవంతంగా మనుగడ సాగించాలని కాంక్షించి – ఆ మహోన్నత లక్ష్య సాధన కోసం తన జీవిత కాలాన్నీ, రాజ్య సంపదలనూ అర్పించిన మొట్టమొదటి గొప్పరాజు అశోకుడు! –(అయిపోయింది)






# కుందనుడి కృతఘ్నత!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, లోకంలో ఎవ్వరూ కేవలం పట్టుదలా, సహనశక్తి వున్నంత మాత్రాన ఆశించిన కార్యాన్ని సాధించలేరు. అలాంటివాళ్ళు లోకంలో కోకొల్లలు. ఆ రెండింటికీ తోడుగా అర్హతా, ఆశించిన దానిని గురించిన పరిపూర్ణమైన పరిజ్ఞానమూ కూడా కావాలి. అలాంటివి గురువుల ద్వారా మాత్రమే సాధ్యపడగలవు. అయితే, గురువులు తమ శిష్యుల నుంచి ప్రతిఫలంగా ఏదైనా కోరడం సహజం. అతి భయానకమైన ఈ శ్మశానంలో, అర్ధ రాత్రి వేళ నువ్వు నిర్భీతిగా తిరుగాడుతున్నా వంటే, ఇందుకు అవసరమైన అర్హతా, మనోదార్ఢ్యాలను ఏ గురువు ద్వారానో

## బేతాళ కథలు



నువ్వు పొంది వుండాలి. కాని, ఒక్కొక్కసారి కార్యసాఫల్యం తరవాత శిష్యులు కృతఘ్నులుగా ప్రవర్తిస్తూంటారు. ఇందుకు ఉదాహరణగా నీకు కుందనుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కుందనుడు ఒక పేదరైతు కొడుకు. అయినా తలిదండ్రులకు లేకలేక పుట్టడం వల్ల గారాబంగా పెరిగాడు. వాడికి చదువు సంధ్యలు అబ్బలేదు. కానీ బాగా చదువుకున్నవాళ్ళూ, పండితులూ మాట్లాడే చమత్కార సంభాషణలు వింటూ, వాడూ చమత్కారంగా మాట్లాడడం అలవరచుకున్నాడు. అలాగే వాడికి పదేళ్ళొచ్చేశాయి.

ఒకరోజున కుందనుడు కొంత మంది పిల్లలతో బంతి ఆట ఆడుతున్నాడు. ఆ సమయంలో రామశాస్త్రి అనే పండితుడు, ఆ దారిన వెళుతున్నాడు. బంతి ఆయనకు తగిలి తెల్లని బట్టలపై నల్లని మచ్చ పడింది.

రామశాస్త్రికి కోపం వచ్చి, "ఎవర్రా అది?" అని హుంకరించాడు.

కుందనుడు తప్ప మిగతా వాళ్ళందరూ అక్కణ్ణించి పారిపోయారు.

రామశాస్త్రి వాడి చేయి పట్టుకుని, "నువ్వు తుంటరివే కాదు, నీకు భయం కూడా లేదు!" అంటూ గుడ్లురిమి చూశాడు.

కుందనుడు చలించకుండా, "సూర్యుడంటే భయపడాలి కానీ చల్లని వెన్నెలలు కురిపించే చంద్రుడంటే భయమెందుకు?" అన్నాడు.

రామశాస్త్రి చప్పున వాడి చేయి వదిలి, "నేను సూర్యుణ్ణి! చంద్రుడినని ఎలా అనుకున్నావు?" అని ప్రశ్నించాడు.

"అయ్యా! సూర్యుణ్ణి తేరిపార చూడలేము. అందువల్ల ఆయనలో మచ్చలున్నా తెలియదు. చంద్రుడిలో మచ్చ స్పష్టంగా కనిపిస్తుంది, మీకూ కనిపిస్తున్నది," అన్నాడు కుందనుడు.

వాడి చమత్కారానికి రామశాస్త్రి మనసులో నవ్వుకుని, "ఈ మచ్చ నాకు సహజంగా లేదు. నీ వల్ల వచ్చింది. అందుకు సమాధానం చెప్పు!" అన్నాడు.

"అయ్యా! తమరిని చంద్రుడంతటి వాడిని చేశాను. ఇక మీదట తమరు చల్లని వెన్నెలలు కురిపిస్తూనే వుంటారు. అందుకు నేనేమి సమాధానం చెప్పాలో మీరే సెలవివ్వండి," అన్నాడు కుందనుడు వినయంగా.

"నన్ను చంద్రుణ్ణి చేసింది నువ్వు. కాబట్టి, నా వెన్నెలలు నువ్వే భరించాలి. రోజూ సాయంత్రాలు మా ఇంటికిరా. నీపై జ్ఞానచంద్రికలు కురిపిస్తాను," అన్నాడు రామశాస్త్రి నవ్వుతూ.

తర్వాత ఆయన కుందనుడి తండ్రిని కలుసుకుని, "నీ కొడుకు చాలా తెలివైన వాడు. అతడికి నేను చదువు చెబుతాను. అందువల్ల జీవితంలో ఎంతో పైకి వస్తాడు," అని చెప్పాడు.

ఆ విధంగా కుందనుడు, రామశాస్త్రి శిష్యుడయ్యాడు. వాడికి చదువు ఆసక్తి కరంగా తోచింది. గురువు వద్ద సకల శాస్త్రాలూ అభ్యసించసాగాడు.

క్రమంగా కుందనుడికి పదిహేనేళ్ళు వచ్చాయి. ఒక రోజున తండ్రి కోసం పొలానికి భోజనం తీసుకువెళుతూంటే, ఇద్దరు మనుషులు పెనుగులాడుతూండ డంగమనించాడు. అందులో ఒకడి చేతిలో కత్తి వుంది. కత్తిలేని వాడు ఆ ఊరికల్లా భాగ్యవంతుడైన ధనగుప్తుడు.

కుందనుడు భోజనం మూటను కిందపెట్టి, కత్తి వున్నవాణ్ణి ఎదుర్కొని ఒడుపుగా అతడి చేతి కత్తిని లాక్కున్నాడు. తర్వాత ధనగుప్తుడూ, కుందనుడూ కలిసి, ఆ వ్యక్తిని బంధించారు.

"ఈ రోజు నా ప్రాణాలు కాపాడావు. నీకేం కావాలో కోరుకో, ఇస్తాను," అన్నాడు ధన గుప్తుడు.

"అవసరమైనప్పుడు తప్పక అడుగుతాను. కానీ మన ఊరిలో ఈ విధంగా దొంగల భయముండడం మంచిది కాదు.



పట్టపగలు వీడు మీపై దాడిచేయగలిగాడు. ఇలాంటివి ముమ్ముందు జరక్కుండా, మన ఊరికి పటిష్ఠమైన రక్షక భటుల దళముండాలి. పెద్దలు – మీరు తల్చు కుంటే ఇలాంటి ఏర్పాటు చేయడం అసాధ్యం కాదు," అని తన దారిన వెళ్ళాడు కుందనుడు.

ఆ సాయంత్రం కుందనుడికి, గ్రామాధి కారి నుంచి పిలుపు వచ్చింది. వాడు రాగానే ఆయన, "ఈరోజు నువ్వు లొంగదీసింది సామాన్యుణ్ణి కాదు. ఈ చుట్టుపక్కల గ్రామాలన్నిటినీ గడగడ లాడిస్తున్న గజదొంగ గంగన్నను లొంగ దీశావంటే, నీలో గొప్ప శక్తి వుండి వుండాలి. నువ్వు యుద్ధవిద్యలు ఎవరి వద్ద నేర్చు కుంటున్నావు?" అని అడిగాడు.



తను రామశాస్త్రి వద్ద శాస్త్రాలు చదివాననీ, యుద్ధవిద్యలు తనకు తెలియవనీ కుంద నుడు చెప్పాడు.

"కానీ నీకు తెలిసిన ఒడుపు తనక్కూడా తెలియదని గంగన్న అన్నాడే?" అన్నాడు గ్రామాధికారి ఆశ్చర్యంగా.

అయన వెంటనే వాడిని గ్రామ సంరక్షకుడుగా నియామకం చేస్తానన్నాడు.

కుందనుడాయనకు నమస్కరించి, "నేను గంగన్నను లొంగదీయడం కాక తాళీయం. యుద్ధవిద్యల్లో శిక్షణ లేకుండా, నేనీ బాధ్యతను తీసుకోవడం మంచిది కాదు," అన్నాడు.

ఆ జవాబుకు గ్రామాధికారి చిన్నగా నవ్వి, "నేను యుద్ధ విద్యల్లో ఆరితేరిన వాణ్ణి. గ్రామాధికారిగా నా మీద చాలా బాధ్యతలున్నాయి. నిన్ను గ్రామ సంర క్షకుడిగా నియమిస్తున్నాను. ప్రతిరోజూ తెల్ల వారుఝామునే వచ్చి, నా వద్ద యుద్ధ విద్యలు నేర్చుకో," అన్నాడు.

ఆ రోజు నుంచీ కుందనుడు, గ్రామాధికారికి శిష్యుడయ్యాడు. వాడికి యుద్ధవిద్యలు కూడా ఎంతో ఆసక్తికరంగా వున్నాయి. గ్రామం చుట్టూ ముళ్ళ కంచె వేశారు. ఒక చోట గ్రామానికి ప్రవేశ ద్వారం ఏర్పాటు చేశారు. కుందనుడు మరిద్దరితో కలిసి అక్కడ కాపలా వుండేవాడు.

కుందనుడు గ్రామ సంరక్షకుడైనాక, రామశాస్త్రి వాడికి ప్రవేశ ద్వారం వద్దనే పాఠాలు చెప్పేవాడు.

అలా క్రమంగా కాలం గడిచి కుందనుడికి ఇరవైఏళ్ళు వచ్చాయి. వాడు సకల శాస్త్రాలూ నేర్చుకున్నాడు. అన్ని రకాల యుద్ధ విద్యలలో ఆరితేరాడు. వాడు తన ఇద్దరు గురువులకూ గురుదక్షిణ ఇస్తా నన్నాడు.

"నీ శక్తి సామర్థ్యాలతో బాగా డబ్బు సంపాయిస్తే, అందులో నుంచి నీకు తోచిన దివ్వు. అంతవరకూ మాకు గురుదక్షిణ వద్దు," అన్నారు రామశాస్త్రీ, గ్రామాధికారీ.

ఈలోగా రాజధానీ నగరం నుంచి, కుందనుడి దూరపు బంధువొకాయన వచ్చాడు. ఆయన కుందనుడి శక్తియుక్తుల గురించి విని, వాడితో, "ఒక మాసం రోజుల్లో, రాజధానిలో ఒక వింత పోటీ జరగబోతున్నది. అక్కడ శాస్త్ర శస్త్ర విద్యల్లో పోటీలు జరుగుతాయి. వాటిలో విడివిడిగా

బహుమతులుంటాయి. ఆ తర్వాత శాస్త్ర విద్యల్లో నెగ్గినవాడు, శస్త్ర విద్యల్లో నెగ్గిన వాడితో పోటీ పడాలి. అలా నెగ్గినవాడికి అపురూపమైన బహుమానమట! దీని గురించి అందరూ వింతగా చెప్పుకుంటు న్నారు. ఇంతవరకూ శాస్త్రవిద్యా పండి తులకూ, శస్త్రవిద్యాధురీణులకూ పోటీ జరగడం ఎవరూ విని వుండలేదు. అయితే, ఈ పోటీల్లో పాల్గొనేందుకు పదివేల వరహాల ప్రవేశ రుసుము చెల్లించవలసి వుంటుంది," అని చెప్పాడు.



కుందనుడికి ఈ పోటీల పట్ల ఆసక్తి కలి గింది కానీ, ప్రవేశరుసుము గురించి విన గానే నిరుత్సాహపడ్డాడు.

ఈ పోటీల విషయం ధనగుప్తుడికి తెలిసింది. ఆయన కుందనుణ్ణి కలుసుకుని, "పదివేల వరహాలూ నేనిస్తాను. నువ్వు రాజధానికి వెళ్ళి పోటీల్లో పాల్గొనవచ్చు. నెగ్గిన తర్వాత, నేను కోరినదివ్వాలి," అన్నాడు.

"నా శక్తికి మించనిదైతే, మీరేం కోరినా ఇస్తాను," అన్నాడు కుందనుడు.

ఇందుకు ధనగుప్తుడు సరేనన్నాడు. కుందనుడు రాజధానికి వెళ్ళాడు. శాస్త్రవిద్యల పోటీలో పాల్గొని ప్రథముడుగా నిలిచి లక్ష వరహాల బహుమతిని గెల్చుకున్నాడు. శస్త్ర విద్యల్లో కూడా పోటీలో వాడే ప్రథముడై మరొక లక్ష వరహాలు గెల్చు కున్నాడు. ఇందువల్ల, శాస్త్ర విద్యాపండి తుడూ, శస్త్రవిద్యా ధురీణుడూ ఒకరితో ఒకరు పోటీ పడవలసిన అవసరం లేకుండాపోయింది. ఇద్దరూ ఒకరే కదా!

అప్పుడా దేశపు రాజు, "ఈ వింత పోటీలు ఇలా ముగియడం సంతోషంగా వుంది. నేనిలాంటి పోటీలు పెట్టడానికి ముఖ్య కారణమొకటున్నది. నా ఒక్కగానొక్క కుమార్తె సునందకు తగిన వరుణ్ణి అన్వేషిస్తున్నాను. స్వయంవరానికి ఇతర దేశాల రాకుమారులను ఆహ్వానించే ఉద్దేశం నాకు లేదు. మన దేశంలోనే అన్నివిధాలా సమర్థుడైన యువకుణ్ణి ఎన్నుకుని, ఒక మంచి కొత్త సంప్రదాయాన్ని ప్రవేశ పెట్టాలనుకున్నాను. తమ సమర్థత మీద పూర్తి విశ్వాసమున్నవారే అందుకు ముందుకు రావాలని, ప్రవేశరుసుం బాగా ఎక్కువ పెట్టాను. నేనిప్పుడు కుందనుడికి, సునంద నిచ్చి వివాహం చేస్తే ప్రజలందరికీ సమ్మత మవుతుందని, నా నమ్మకం," అని ప్రక



టించాడు. సభికులు ఆనందోత్సాహాలతో చప్పట్లు చరిచారు.

రాకుమార్తెకూ, కుందనుడికీ పెళ్ళి ముహూర్తం నిశ్చయమైంది. ఆ వేడుకకు రావలసిందిగా కుందనుడి తల్లిదండ్రులకూ, గురువులకూ, ధనగుప్తుడికీ ఆహ్వానాలు వెళ్ళాయి. అందరూ ముహూర్తానికి ఒక రోజు ముందే వచ్చారు.

కుందనుడు, రామశాస్త్రికీ, గ్రామాధికారికీ తను పోటీల్లో గెల్చిన మొత్తాన్ని గురుదక్షిణగా ఇస్తూ, "పూర్తిగా మీ చలవ వల్లనే, నేనింతటి వాడినయ్యాను," అన్నాడు.

రామశాస్త్రి వాడివ్వ చూపిన డబ్బు తీసుకోక, "నువ్వు రాజువు కానున్నావు. అప్పుడు నన్ను రాజాస్థాన పండితుణ్ణి చెయ్యి. అదే నేను కోరే గురుదక్షిణ!" అన్నాడు.

ఇది విని కుందనుడు ఆశ్చర్యపోయి, "గురువర్యా! ఆస్థాన పండితుడి నియామకానికి కొన్ని పద్ధతులుంటాయి. వాటి ననుసరించి మీకా అవకాశం వస్తే సరేసరి. అందుకు నా ప్రయత్నం నేను చేస్తాను. కానీ గురుదక్షిణతో దీన్ని ముడిపెట్టవద్దు. నేనిచ్చే లక్ష వరహాలూ తీసుకోండి," అని ప్రాథేయపడ్డాడు.

రామశాస్త్రి కోపంగా, "మూర్ఖుడా! వీధుల వెంటపడి అల్లరిచిల్లరగా తిరుగుతూంటే, నిన్ను చేరదీసి ఇంతవాణ్ణి చేశాను. నా మూలంగా ఇంతవాడివై, నన్నే పరీక్షకు గురి చెయ్యబోతున్నావా? నువ్వు కృతఘ్నుడివి!" అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి తనకు గురుదక్షిణగా సైన్యాధిపతి పదవి కావాలన్నాడు. కుందనుడాయనకు రామశాస్త్రికి చెప్పినట్టే చెప్పాడు. గ్రామాధికారి కూడా వాణ్ణి కృతఘ్నుడని తిట్టి వెళ్ళిపోయాడు.

ఇక ధనగుప్తుడు, కుందనుణ్ణి తన కూతుర్ని పెళ్ళి చేసుకోమన్నాడు. అందుకు కుందనుడు మృదువుగా తిరస్కరించాడు. ఆయనా, వాణ్ణి కృతఘ్నుడని తిట్టి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కుందనుడు తను రాజు కానున్నానన్న అహంకారంతో, తననంతవాణ్ణి చేసిన గురువుల కోర్కెలను తిరస్కరించడం కృతఘ్నతే కదా? అంతేకాక, వాడు పోటీల్లో పాల్గొనేందుకు అవసరం అయిన ధనసహాయం చేసిన ధనగుప్తుడి కోర్కెను తిరస్కరించాడు. ఆయన కుమార్తెను వివాహమాడననడం

కృతఘ్నుత కాదా? ఈ సందేహాలకు సమా ధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేశాన్నేలే మహా రాజే తన కూతుర్ని తనకు తోచిన వాడికివ్వక, పోటీలు పెట్టి సమర్థుడి నెన్నుకున్నాడు. ఆ పోటీల్లో నెగ్గడం వల్లనే కుందనుడు, రాకుమారిని వివాహమాడి దేశానికి రాజు కాబోతున్నాడు. దాని అర్థం, వాడికిష్టులైన వారికి పదవులు పంచిపెట్టాలని కాదు. ఆస్థానపదవులకు సమర్థులనే ఎన్నుకోవాలి. అందుకు అవసరమైన నియమాలను పాటించాలి. ఆ మాటే వాడు తన గురువులకు చెప్పాడు. వాళ్ళకు తమ సమర్థత మీద నమ్మకం లేదు. వాళ్ళవల్లనే కుందనుడు అంత ఉన్నత స్థాయికి చేరిన మాట నిజం. అయితే, అందుకు వాడి సమర్థతా, ఆత్మవిశ్వాసం దోహదమయ్యాయి. వాడి గురువులు నిజంగా సమర్థులైతే, తమ కోర్కెలు తీర్చుకునేందుకు వాడి మీద ఆధారపడవలసిన అవసరం లేదు. వాస్తవంలో – గురువు శిష్యుడికి విద్యా బోధనలు చేయగలడు కానీ గొప్పవాణ్ణి చేయలేడు. గొప్పవాడు కాగలిగిన లక్షణాలు శిష్యుడిలో వుండాలి. శిష్యుడు గొప్పవాడైతే, గురువు అంతకన్న గొప్పవాడై వుంటా డనుకోవడం పొరపాటు. ఇక ధనగుప్తుడి సంగతి. పోటీలకు ముందే ఆయన, తన కుమార్తెను వివాహమాడమని కుందనుణ్ణి అడిగి వుంటే, వాడందుకు సమ్మతించి వుండేవాడేమో! కానీ, రాకుమార్తెతో వాడి వివాహం నిశ్చయం అయ్యాక, ధనగుప్తుడు తన కుమార్తె ప్రసక్తి తేవడం అతడి తప్పు. ఆయన కుందనుడికిచ్చిన పదివేల వరహాల మాటకొస్తే – గజదొంగ గంగన్న నుంచి తనను కాపాడినందుకు, కుందనుడే మడిగినా యిస్తానన్నాడు. ఆ పదివేల వరహా లతో ధనగుప్తుడి ఋణం తీరినట్లయింది. ఈ అన్ని కారణాల వల్ల, కుందనుడు ఏమాత్రం కృతఘ్నుడు కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. –(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# నమ్మకం

వరహాలశెట్టి అనే వడ్డీ వ్యాపారి దగ్గర చంద్రం అనే కుర్రాడు పని చేస్తూండేవాడు. వాడి సేవకు తగిన జీతం రావడం లేదని వాడు ఆ పని మానేసి, నాగభూషణం అనే మరొక ఆసామీ దగ్గరికి వెళ్ళి పని ఇప్పించవలసిందిగా అడిగాడు.

నాగభూషణం చంద్రం మాటలు విని, "సరే చూద్దాం!" అన్నాడు. అంతలో ఆయన లోపలికి వెళ్ళి, పదిరూపాయల నోట్ల కట్టతో తిరిగి వచ్చి. దానిని చంద్రంకు ఇస్తూ, "ఈ డబ్బు మొత్తం వెయ్యి రూపాయలు. వరహాల శెట్టికి ఇచ్చిరా!" అన్నాడు.

అలాగేనని చంద్రం డబ్బును తీసుకుని వెళ్ళి, అరగంటలో తిరిగి వచ్చాడు. నాగభూషణం వాణ్ణి, "వెయ్యిరూపాయలు సరిగ్గా ఇచ్చావా?" అని అడిగాడు. ఇచ్చానన్నాడు చంద్రం. నాగభూషణం కోపంగా, "నేను పదిరూపాయలు ఎక్కువ ఇచ్చాను. నువ్వు ఆ పదిరూపాయలు కొట్టేసి, శెట్టికి వెయ్యిరూపాయలే ఇచ్చావు. నువ్వు నాకు పనికిరావు!" అన్నాడు.

"అయ్యా! తమరు డబ్బు నా చేతికిస్తూ అవి వెయ్యి రూపాయలు అన్నారు. మీ ఎదుట వాటిని లెక్కపెట్టడం మిమ్మల్ని నమ్మకపోవడం అవుతుందని అలాగే వెళ్ళాను. కాని శెట్టిగారికి ఇచ్చినప్పుడు లెక్కపెట్టి ఇచ్చాను. పదిరూపాయలు ఎక్కువగా ఉన్నాయి. దానిని మీకు ఇవ్వాలనుకున్నాను గాని నాపై అనుమానంతో మీరు అలా చేశారని తెలిసింది. నమ్మకం మీకెంత ముఖ్యమో, నాకూ అంతే ముఖ్యం. నాకు ఇక్కడ పని అవసరంలేదు," అంటూ చంద్రం వెనక్కు తిరిగి, "మీరు చెప్పిన పనికి ఈ పదిరూపాయలు సరిపోయింది," అంటూ వెళ్ళిపోయాడు.

— కోలపల్లి ఈశ్వర్



కావేరీతీర ప్రయాణం-2

# జలాశయాల నిర్మాణం

◆రచన: జయంతి మహాలింగం
◆చిత్రాలు: గౌతమ్‌సేన్

కొడగుకు దాదాపు 30 కి.మీ. దూరంలో రామనాథపురం దగ్గర కావేరీ నది ఎడమ గట్టు మీద ఒక బ్రహ్మాండమైన బండరాయి పైకి లేచి ఉన్నది. ఆ బండరాయి మీద ఒక శివాలయం ఉన్నది. దానిని స్థానికులు గోగర్భం అని పిలుస్తారు. రావణుణ్ణి చంపిన పాపం పోగొట్టుకోవడానికి శ్రీరాముడు ఇక్కడి శివలింగాన్ని పూజించాడని ఒక కథ ప్రచారంలో ఉన్నది. ఆదిశంకరులు కూడా ఈ ఆలయాన్ని దర్శించి, పవిత్రత సమకూర్చాడని కూడా పలువురు విశ్వసిస్తారు.


రామనాథపుర ఆలయం

దీనికి మరికొంత దిగువుగా వున్న కట్టెపుర గ్రామ సమీపంలోని ప్రాచీనమైన ఆనకట్ట కావేరీ నది వేగాన్ని అదుపు చేస్తున్నది. దాదాపు 900 సంవత్సరాలకు పూర్వం, లింగాయత శాఖకు చెందిన శైవ సన్యాసులైన జంగమలు నిర్మించడం వల్ల దీనికి 'జంగమఘట్టె' అనే పేరు వచ్చింది. 1.2 మీ ఎత్తయిన రాతి బండలను చక్కగా చెక్కి ఈ ఆనకట్ట నిర్మించిన తీరు ఆశ్చర్యం కలిగిస్తుంది. అదీ ఎటువంటి సాంకేతిక సహాయమూ లేకుండా జంగమలు ఈ ఆనకట్టను నిర్మించడం మరింత ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆ సన్యాసుల నైపుణ్యానికి కావేరీ మాత సైతం విస్మయం చెందుతున్నదా అన్నట్టు ఇక్కడ నదీ జలాలు నెమ్మదిగా ప్రవహిస్తున్నాయి.

చుంచనకట్టె సమీపంలో నదీ జలాలు 20 మీ॥ ఎత్తు నుంచి కిందికి ఉరుకుతున్నాయి. చుంచ అనే ఆటవిక తెగ నాయకుడు ఒకడు ఇక్కడ ఆనకట్ట నిర్మించాడని చెబుతారు. అందుకే దీనికి 'చుంచన కట్టె' అనే పేరు వచ్చింది. ఇక్కడ కావేరీ జలాలు ఉధృతంగా దూసుకుపోయే ఇరుకైన మార్గాన్ని ధనుష్కోటి అనేవారు. ఇప్పుడు భారత దక్షిణాగ్ర ప్రాంతం ధనుష్కోటిగా ప్రసిద్ధి గాంచింది. 'సీతయె బచ్చలు' అనే చోట సీతమ్మవారు స్నానం చేసినట్టు మరొక కథ ప్రచారంలో ఉన్నది. ఇక్కడ స్థానికులు ఒక ఆలయం కూడా నిర్మించారు. కావేరీతీరంలో పెద్ద కోదండరామ ఆలయం ఉన్నది.


చుంచనకట్టె జలపాతం



కృష్ణరాజసాగర రిజర్వాయర్

ఇటీవలి కాలంలో నిర్మించిన ఆనకట్టలు, కావేరీ నదీ జలాలకు అడ్డు తగిలి గొప్ప జలాశయాలను ఏర్పరుస్తున్నాయి. అటువంటి వాటిలో ప్రధానమైనది కృష్ణరాజ సాగర డ్యామ్. ఉపనదులైన హేమావతి, లక్ష్మణతీర్థ నదులు కావేరిలో సంగమించే ప్రదేశంలో కన్నంబాడి అనే కృష్ణరాజసాగర్ రిజర్వాయర్ నిర్మించారు.

ఒక గొప్ప వ్యక్తి కన్న స్వప్న ఫలితమే ఈ రిజర్వాయర్ నిర్మాణం. ఆయనే సుప్రసిద్ధ ఇంజనీరు మోక్షగుండం విశ్వేశ్వరయ్య. ఆయన బ్రిటిష్ ప్రభుత్వం సర్ బిరుదు, మనదేశం స్వాతంత్ర్యం పొందాక భారతరత్న సత్కారం పొందారు. బ్రహ్మాండమైన రిజర్వాయర్లు నిర్మించడంలో ఆయన ఎంతో నిపుణుడు. బొంబాయి ప్రభుత్వంలో 25 సంవత్సరాలు ఉద్యోగం చేసి ఆయన 1909వ సం॥లో మైసూరుకు ప్రధాన ఇంజనీరుగా వచ్చారు. 1903వ సం॥లో పూనే సమీపంలోని ఖడక్ వాస్లా డ్యామ్‌కు 'ఆటోమేటిక్ స్లూయిజ్' గేట్లు రూపొందించడంతో ఆయన అప్పటికే ఎంతో ప్రసిద్ధి గాంచారు. రిజర్వాయర్‌లో నీటిమట్టం నిర్ణీత మట్టానికి ఎక్కువయినట్టయితే, తలుపులు వాటంతట అవే తెరుచుకునేవి. అదనపు జలాలు వెలుపలికి వెళ్ళేలా వాటి నిర్మాణం జరిగింది. నీళ్ళు మామూలు మట్టానికి తగ్గిన తర్వాత మళ్ళీ వాటంతట అవే మూసుకునేవి. తాను కనుగొన్న ఈ విధానాన్ని 'పేటెంట్' చేసినప్పటికీ, దానికి రాయల్టీ పుచ్చుకోవడానికి ఆయన నిరాకరించారు. నీటి సరఫరా సక్రమంగా జరగడానికి వీలుగా ఆయన 'బ్లాక్' వ్యవసాయ పద్ధతిని ప్రవేశపెట్టారు.

కన్నంబాడికి దిగువ 35 కి.మీ. దూరంలో



బృందావన్ గార్డెన్స్

శివసముద్రం వద్ద భారతదేశంలోనే ప్రప్రథమంగా (1902వ సం॥లో) జల విద్యుత్ కేంద్రం (హైడ్రో ఎలక్ట్రిక్ స్టేషన్) ఏర్పరచారు. అక్కడినుంచి కోలార్ బంగారు గనులకు విద్యుత్ సరఫరా జరిగేది. అయితే వేసవి కాలంలో విద్యుత్తు కోత ఏర్పడేది. ఒక్కొక్కసారి పూర్తిగా ఆగిపోయేది.



కోలార్ బంగారు గనిలో కార్మికులు

బంగారు గనుల అధికారులు విశ్వేశ్వరయ్యకు తమ సమస్యను తెలియజేసి, విద్యుచ్ఛక్తి సరఫరా కొరత లేకుండా సక్రమంగా జరిగే మార్గం ఆలోచించమన్నారు. విశ్వేశ్వరయ్య తీవ్రంగా ఆలోచించి, కేవలం కోలార్ బంగారు గనులకే కాకుండా, వేలాది మంది రైతులకు కూడా ఉపయోగపడే ఒక బృహత్ ప్రణాళికను తయారు చేశారు. అందుకు కావేరీ నదికి అడ్డుగా ఒక బ్రహ్మాండమైన ఆనకట్ట నిర్మించాలని మైసూరు మహారాజాకు తెలియజేశారు. ఆ పథకానికి అయ్యే వ్యయం 2.5 కోట్ల రూపాయలు! అంటే మైసూరు ప్రభుత్వం వ్యవసాయానికి అంతకు ముందు యాభై సంవత్సరాలలో అంత మొత్తాన్ని ఖర్చు చేసి వుందన్న మాట. ఆ మొత్తాన్ని వినగానే మైసూరు మహారాజా నాలుగవ కృష్ణరాజ ఉడయార్ మొదట అవాక్కయ్యాడు. కాని ఆ తరవాత ఆ పథకం పూర్తిచేయడానికి సంపూర్ణ సహాయ సహకారాలు అందజేయడానికి అంగీకరించాడు.



1911వ సం॥లో కన్నంబాడి డ్యామ్‌కు పునాదులు తవ్వడం ఆరంభమయింది. ఆ డ్యామ్ 2,621 మీ॥ పొడవూ, 43 మీ॥ ఎత్తూ వుండాలని పథకం రూపొందించబడింది. ఈ రిజర్వాయర్‌లో 1400 మిలియన్ క్యూబిక్ మీటర్ల జలాలు నిలువ చేయవచ్చు. 1915వ సం॥లో డ్యామ్ ఎత్తు 24 మీ॥ పెంచారు. ఇప్పుడు కోలార్ బంగారు గనులకు విద్యుత్ సరఫరా కొరత లేకుండా సక్రమంగా జరగసాగింది. 1924వ సం॥లో డ్యామ్ పూర్తి ఎత్తుకు పెంచబడింది. ఇంతకూ ఆ ఆనకట్టను కాంక్రీటుతో నిర్మించలేదు. మన దేశంలోనే తయారుచేసిన 'సుర్ఖీ' అనే ఒక మిశ్రమంతో దాని నిర్మాణం జరిగింది. సున్నమూ, కాలిన ఇటుకలూ కలిపి మెత్తగా ఆడించే గట్టి మిశ్రమం ముద్దను సుర్ఖీ అంటారు. ఇది చౌకగా ఆ ప్రాంతంలో కావలసినంత దొరికేది. గట్టి పడడానికి కొంత కాలం పడుతుంది తప్ప, గట్టి పడ్డాక సిమెంటులాగా చాలా దృఢంగా వుంటుంది. ఇది కన్నంబాడి డ్యామ్‌కు కావలసిన శక్తికి పదింతలు ఎక్కువ శక్తిని ఇచ్చింది.

మహారాజా పేరు మీదుగా ఈ రిజర్వాయర్‌కు 'కృష్ణరాజ సాగర' అని పేరు పెట్టారు. ఆనకట్టకు 18 మీ॥ దిగువగా 'బృందావన్ గార్డెన్స్' ఏర్పరచారు. 1922వ సంవత్సరంలో దీని నిర్మాణం ప్రారంభమయింది. ఆ తరవాత మన దేశంలోని మిగతా రిజర్వాయర్ల వద్ద కూడా ఇటువంటి ఉద్యానవనాలను

ఏర్పరచారు. ఈ విషయంలో ఇది దేశానికే మార్గదర్శకం అని చెప్పవచ్చు. మూడు అంతస్తులుగా ఎనిమిది హెక్టార్ల వైశాల్యంలో విస్తరించిన ఈ ఉద్యానవనాన్ని చూడడానికి 1936వ సం॥ నుంచి ప్రజలను అనుమతించడం మొదలయింది.

ఆ తరవాత, రిజర్వాయర్ నుంచి 18 మీటర్ల ఎత్తయిన కట్టతో 45 కి.మీ. పొడవైన విశ్వేశ్వరయ్య కాలువను తవ్వారు. ఇది పూర్తయ్యే నాటికి అదనంగా 36,000 హెక్టార్ల భూమి సాగులోకి వచ్చింది. ఈ బ్రహ్మాండమైన పథకాన్ని 10,000 మంది కార్మికులు, మరెందరో ఇంజనీర్లు రాత్రింబవళ్ళు కష్టపడి పూర్తి చేశారు. ఒకసారి జలప్రవాహం ఎక్కువై, కొత్తగా ఏర్పరచిన కాలువను దెబ్బతీస్తుందని తెలియగానే, ఆ ప్రవాహాన్ని దారిమళ్ళించడానికి ఇంజనీర్లూ, కార్మికులూ రాత్రుల్లో దీపాల వెలుతురులో పనిచేశారు!

ఈ ప్రాంతంలో ఆనకట్ట నిర్మించాలని ఒక్క విశ్వేశ్వరయ్య మాత్రమే ఆలోచించలేదు. ఆయనకు పూర్వమే మరొకరు కూడా దీనికి ప్రయత్నించారు. రిజర్వాయర్ నిర్మాణానికి పునాదుల కోసం కార్మికులు భూమిని తవ్వుతూన్నప్పుడు 1794వ సం॥లో వేసిన శిలాఫలకం ఒకటి బయట పడింది. ఆ ఫలకం మీద పర్షియన్ లిపిలో ఇలా చెక్కబడి ఉన్నది: పరమ కరుణామయుడైన భగవంతుడి పేరు మీదుగా, ఆయన నీడ అయిన హజరత్ టిప్పు సుల్తాన్... కావేరీ నదికి ఆనకట్ట నిర్మించడానికి రాజధానికి పశ్చిమంగా పునాదులు వేయిస్తున్నాను.... ప్రారంభించడం నా వంతు. కాని, దానిని పూర్తి చేయడం ఆ భగవంతుడి చేతుల్లోనే ఉన్నది!

## సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య

మైసూరు సంస్థానంలో దివానుగా ఉన్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య (1860-1962) మైసూరు ప్రాంత అభివృద్ధికి అద్భుతమైన కృషి చేశారు. భద్రావతీ ఐరన్ అండ్ స్టీల్ వర్క్స్, మైసూరు విశ్వవిద్యాలయం, ప్రభుత్వ సోప్ ఫ్యాక్టరీ మరి కొన్ని పరిశ్రమలు, సంస్థలు ప్రారంభించడానికి ఆయన మేధాసంపత్తి, అద్భుతమైన మార్గదర్శకత్వం ఎంతో దోహదం చేశాయి. ఆయన దివానుగా వున్న 1913-1918 మధ్య కాలంలో పాఠశాలల సంఖ్య రెండింతలుగా పెరిగింది. అంతకు ముందు ఆయన చీఫ్ ఇంజనీరుగా పని చేశారు. భారతదేశ అభివృద్ధి దాని పారిశ్రామికీకరణను బట్టే వుంటుందని ఆయన గాఢంగా విశ్వసించారు. "పరిశ్రమలను పెంపొందించు; లేదా నశించి పో!" అన్నదే ఆయన నినాదం. మన దేశం స్వాతంత్ర్యం పొందాక రూపొందించిన పంచవర్ష ప్రణాళికలకు చాలాకాలం పూర్వమే ఆయన ప్రణాళికలను గురించి పుస్తకాలు రాశారు. ఆయన వృద్ధాప్యంలో కూడా ఎంతో చురుకుగా ఉండేవారు. 86వ యేట కూడా 75 అడుగుల ఎత్తయిన భవనం మెట్లను మరొకరి సాయం లేకుండా సునాయాసంగా ఎక్కగలిగేవారు. ఆ వయసులోనూ ఆరోగ్యంగానూ, ఉత్సాహంగానూ ఆయన ఉండేవారు.



సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య



నాలుగవ కృష్ణరాజ ఉడయార్



# మారిన దంపతులు

ఒక ఊళ్ళో రంగయ్యా, రత్తమ్మా అనే దంపతులు ఉండేవారు. వాళ్ళకు ఎంత చిన్న విషయం మీదా ఏకాభిప్రాయం ఉండేది కాదు. అస్తమానమూ పోట్లాడుకుంటూ ఉండేవారు. వాళ్ళ కీచులాటలకు కారణాలు వింటే ఊళ్ళో వాళ్ళకు ఆశ్చర్యంగా ఉండేది. ప్రతి స్వల్ప విషయానికీ పోట్లాడుకోవద్దని ఇరుగు పొరుగు వాళ్ళు వాళ్ళకు ఎంతో చెప్పి చూశారు. కాని లాభం లేకపోయింది.

వాళ్ళకు లేక లేక రాముడని ఒక కొడుకు పుట్టాడు. వాడంటే ఇద్దరికీ పంచ ప్రాణాలు. ఆ కారణం చేతనైనా వాళ్ళ మధ్య పోట్లాటలు తగ్గలేదు. రాముడు పెరిగి పెద్ద అవుతున్న కొద్దీ, వాడికి తన తల్లిదండ్రుల కీచులాటలు బొత్తిగా నచ్చకుండా పోయాయి. వాళ్ళను గురించి పరిహాసంగా చెప్పుకుని ఊళ్ళో వాళ్ళు నవ్వటం విని వాడు సహించలేకపోయేవాడు. వాళ్ళను ఏ విధంగా మార్చాలో వాడికి తెలియలేదు.

పన్నెండేళ్ళ వయసులో వాడికి ఇదొక తీరని విచారంగా తయారయింది. వాడు పశువులను మేతకు తోలుకుపోయి, అక్కడ కూడా ఈ విషయమే ఆలోచిస్తూ విచారంగా కూర్చుని ఉన్నాడు.

ఆ సమయంలో వాళ్ళ ఊరి భూత వైద్యుడు అటుగా వచ్చి, "ఏంరా, బాబూ, విచారంగా ఉన్నావు?" అని అడిగాడు.

రాముడు తన తల్లిదండ్రుల పోట్లాటలను గురించి ఆ భూత వైద్యుడికి చెప్పి, "బాబూ, వాళ్ళు అలా కొట్లాడుకుంటూన్నంత కాలమూ నాకు ఈ విచారం ఉండేదే," అన్నాడు.

"నాయనా, దిగులుపడకు. నీ తల్లిదండ్రులను మారిస్తే నువ్వే మార్చాలి. దానికి

25-ఏళ్ళనాటి చందమామ కథ



అబద్ధం! వాడు తనను చొక్కా ఉతక మనలేదు. వాడిలో ఈ మార్పుకు కారణం మరేదో అయి ఉంటుందనుకుని ఆమె సరుకులు తీసుకురావటానికి అంగడికి వెళ్ళింది.

కొంతసేపటికి రంగయ్య పొలం నుంచి తిరిగివచ్చి, మూతి ముడుచుకు కూర్చున్న కొడుకును చూసి, "ఏంరా? ఏమిటి అలా ఉన్నావు? ఒంట్లో బాగాలేదా?" అని అడిగాడు.

"బాగాలేకేం? నలుగురి మధ్యా తలెత్తుకు తిరగడమంటే కష్టంగా ఉంది!" అన్నాడు రాముడు.

"నీకొచ్చిన తలవంపులేమిటి?" అని తండ్రి మళ్ళీ అడిగాడు.

"మంచి బట్టలు లేవు. ఎండలోనూ, వానలోనూ ఉత్త కాళ్ళతోనే తిరగాలి. చెప్పులు లేవు. ఒక్కగానొక్క కొడుకును ఇలాగేనా చూసేది?" అని రాముడు విసుక్కున్నాడు.

ఈ మాటలు విని రంగయ్య వెలవెలపోయాడు. రాముడు నోరు తెరిచి ఎన్నడూ ఏదీ అడిగి ఎరగడు, తండ్రితో ఎన్నడూ ఇలా నిష్ఠురంగా మాట్లాడి కూడా ఎరగడు.

ఇంతలో సరుకులు కొని రత్తమ్మ ఇల్లు చేరింది. తండ్రి కొడుకుల సంభాషణ ఆమె విన్నది. తండ్రితో కూడా వాడు మామూలుగా లేడు. ఆ రాత్రి భోజనాల దగ్గిర కూడా రాముడు తల్లిదండ్రులిద్దరినీ తెగ విసిగించాడు. వాడు భూతవైద్యుడి సలహా అమలు చేస్తున్నాడు. వారం రోజులు గడిచాయి. రాముడు మామూలు మనిషి కాలేదు.

ఒక ఉపాయం చెబుతాను. నేను చెప్పినట్టు చెయ్యి," అంటూ భూతవైద్యుడు రాముడికి రహస్యంగా ఏదో చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం పశువులను తోలుకుని ఇంటికి వస్తూనే రాముడు తల్లితో, "అమ్మా, నా చొక్కా ఉతికి ఆరెయ్యమని పొద్దున చెప్పానా లేదా? నీకు ఇంత మతిమరుపేం? నీకో కొడుకు ఉన్న సంగతి జ్ఞాపకం ఉంటున్నట్టు లేదే?" అంటూ ఇంతెత్తున ఎగిరిపడ్డాడు.

వాడి ప్రవర్తన చూసి రత్తమ్మ నిర్ఘాంతపోయింది. ఎన్నడూ తనను పల్లెత్తు మాట అనని కొడుకు ఏదో పూనినట్టుగా ఎందుకిలా ఎగిరి పడుతున్నాడో ఆమెకు అర్థం కాలేదు. పైగా వాడన్న మాట

రత్తమ్మ తన భర్తతో, "వీడికి ఏదో గాలి తగిలినట్టుంది. మంత్రం వేయింతాం," అన్నది.

"మంత్రం వెయ్యటం ఏమిటి? మందిప్పించాలి," అన్నాడు రంగయ్య.

"ఈ జబ్బుకు మందెవడిస్తాడు? భూత వైద్యుడైతే మంత్రం వేసి క్షణంలో దయ్యాన్ని వదిలిస్తాడు," అన్నది రత్తమ్మ.

"వైద్యుడైతేగాని ఈ రోగం కనిపెట్ట లేడు," అన్నాడు రంగయ్య.

ఇద్దరూ చచ్చేట్టు పోట్లాడుకున్నారు. వాళ్ళను చాలాసేపు పోట్లాడుకోనిచ్చి రాముడు, "నేను ఫలానా భూతవైద్యుడి దగ్గిరికైతే వస్తాను," అన్నాడు.

ఎవరి దగ్గరికీ రాను అనకుండా వాడు భూతవైద్యుడి దగ్గిరికి వస్తానన్నం దుకు తల్లిదండ్రులు సంతోషించి, వాణ్ణి తీసుకుని భూతవైద్యుడి దగ్గరికి వెళ్ళారు.

వాళ్ళు చెప్పినదంతా విని భూత వైద్యుడు, "మీ కుర్రవాడికి నయం చెయ్యటం పెద్ద పని ఏమీ కాదు. కాని నేను మిమ్మల్నిద్దరినీ విడివిడిగా ఒక ప్రశ్న అడుగుతాను. ఆ ప్రశ్నకు మీరు సరి అయిన సమాధానం చెప్పిన తరవాత మీవాడికి పట్టిన దయ్యాన్ని క్షణంలో వదలగొట్టుతాను," అన్నాడు.

ఆయన ముందు రంగయ్యను పిలిచి, "రాముడు నీ కొడుకే గదా?" అని అడిగాడు.

ఈ ప్రశ్నకు రంగయ్య ఆశ్చర్యపడి, "చిత్తం," అన్నాడు.

తరవాత ఆయన రంగయ్యను అవతలికి పంపి, రత్తమ్మను పిలిచి, "రాముడు నీ కొడుకే గదా?" అని అడిగాడు. ఆమె కూడా రంగయ్య చెప్పినట్టే, "చిత్తం!" అన్నది.



తరవాత ఆయన ఇద్దరినీ పిలిచి, "మీరిద్దరూ సరి అయిన సమాధానం చెప్పలేదు. ఒక వారం గడిచాక సరి అయిన సమాధానం ఆలోచించుకు రండి," అన్నాడు.

వారం గడిచింది. దంపతులిద్దరూ భూతవైద్యుడి దగ్గరికి వచ్చారు. ఆయన వారిని విడి విడిగా మళ్ళీ అదే ప్రశ్న వేశాడు.

ఈసారి రంగయ్య, తెలివిగా చెబుతున్నా ననుకుని, "వాడు నా భార్య కొడుకండి," అన్నాడు.

రత్తమ్మ మాత్రం, "వాడు నా కొడుకే నండి," అన్నది.

ఈసారి కూడా భూతవైద్యుడు చిరునవ్వు నవ్వి, "మీరిద్దరూ సరి అయిన సమాధానం చెప్పలేదు. మరింత బాగా ఆలోచించుకుని, వారం దాటినాక మళ్ళీ రండి," అన్నాడు.

రాముడి పిచ్చి నానాటికీ ముదురుతున్నది. ఈసారి రంగయ్యా, రత్తమ్మా భూతవైద్యుడికి ఏం చెప్పాలో కూడ బలుక్కుని ఒక నిర్ణయానికి వచ్చారు.

వారం గడవగానే వాళ్ళిద్దరూ భూతవైద్యుడి వద్దకు వెళ్ళి, "మేం ఇద్దరం బాగా సంప్రతించుకుని వచ్చాం. రాముడు మా ఇద్దరి బిడ్డ," అని ఆయన ప్రశ్నకు విడి విడిగా సమాధానం చెప్పారు.

భూతవైద్యుడు మనస్ఫూర్తిగా నవ్వి, "ఈసారి మీరు సరి అయిన సమాధానం చెప్పారు. ఇన్నాళ్ళకు మీ దయ్యం వదిలింది. మీరిద్దరూ కూడబలుక్కున్నారు. భార్యాభర్తలు ఒకరితో ఒకరు సంప్రతించుకోకుండా ఒకరు కోటికీ, ఒకరు ఏటికీ లాగుతూంటే జీవితమంతా పోట్లాటే! రాముడికి ఏమీ లేదు. నా సలహా మీదనే వాడు నాటకం ఆడాడు. ఒకరి సంగతి ఒకరు ఆలోచిస్తూ సుఖంగా ఉండండి. రాముడు రత్నంలాటి వాడు. మీరు మీ తగాదాలతో వాడికి సుఖం లేకుండా చేశారు," అని మందలించారు.

రంగయ్యా, రత్తమ్మా ఈ దెబ్బతో గుణపాఠం నేర్చుకుని కొట్లాటలు మాని, ఒకరినొకరు సంప్రతించుకుంటూ సుఖంగా బతకటం నేర్చుకున్నారు. రాముడి ప్రాణం సుఖానపడింది.



ఆంగ్లేయులను ఎదిరించిన యోధులు

7

# వేలు తంపి

రచన: మీరా ఉగ్రా ◆ చిత్రకారుడు: టి.జి. షెట్టీ

దాదాపు 200 సం॥లకు పూర్వం రాజా బలరామవర్మ, తిరువాన్కూరు సంస్థానాన్ని పరిపాలించాడు. ఆయన ప్రధానమంత్రి (దళవా)గా వేలు తంపి ఉండేవాడు.



ఈస్టిండియా కంపెనీ తరపు ప్రతినిధి కల్నల్ మెకాలేను, ఒకసారి వేలు తంపి, ధిక్కరించాడు.




ఆ కాలంలోని చాలామంది పాలకుల లాగే రాజా బలరామ వర్మ కూడా, ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక సహాయాన్ని పొందుతూ, దానికి తలవొగ్గి యేటా కొంత కప్పం చెల్లించేవాడు. మెకాలే ఆయనకు హెచ్చరికతో కూడిన ఒక లేఖను పంపాడు.




మెకాలే మరింత అవమానకరమైన పదజాలంతో, తంపిని దూషిస్తూ, ఉత్తరం వెనక ఉత్తరం పంపాడు. ఆఖరికి –




వేలు తంపి కొత్తగా చాలా మందిని సైన్యంలో చేర్చుకోసాగాడు. కోటలను బాగుచేయడం మొదలుపెట్టాడు. ఒకనాడు –



మెకాలేకు ఆ లేఖను పంపిన వెంటనే తంపీ సైనికులు కున్నిపిళ్ళే నాయకత్వంలో మూయబడిన పడవలలో రహస్యంగా బయలుదేరారు.



తంపీ సైనికులు 1808వ సం॥ డిసెంబర్ 28వ తేదీ అర్ధరాత్రి సమయంలో మెకాలే నివాస భవనం మీద దాడి జరిపారు. మెకాలే దిగ్భ్రాంతి చెందాడు.




సైనికులు మెకాలే భవనాన్ని దోచుకున్నారు. అక్కడున్న రికార్డులన్నిటినీ నాశనం చేశారు. అయితే, మెకాలే మాత్రం అక్కణ్ణించి తప్పించుకున్నాడు.




మరునాడు అల్లెప్పీ, క్విలాన్‌లోని బ్రిటిష సైనికుల మీద దాడి జరిగింది.



తంపి క్విలాన్‌కు కొంత దూరం తూర్పు దిశలో వున్న కుండారాను చేరుకున్నాడు. అక్కడి నుంచి ఒక ప్రకటన జారీ చేశాడు.




మన ఇళ్ళనూ,
ఆస్తిపాస్తులనూ రక్షించుకోవా
లంటే మేనం బ్రిటిష్ వాళ్ళను
తరుమగొట్టాలని వేలు తంపి
ప్రబోధిస్తున్నాడు.


వేలు తంపి మాటలతో ఉత్తేజితులైన సాధారణ ప్రజలు బ్రిటష్ వాళ్ళకు ఎదురు తిరిగారు


ప్రజలు ఎదురు తిరిగిన సమాచారం, కంపెనీ ప్రధాన కార్యాలయం వున్న మద్రాసుకు చేరింది. అన్ని వైపుల నుంచీ క్విలాన్‌కు కంపెనీ సైనిక సహాయం రాసాగింది.


...1809, జనవరి 18వ తేదీ. దాదాపు ఆరుగంటలసేపు జరిగిన కాల్పులు, ఎదురు కాల్పులలో తంపి సైన్యం దాదాపు నిర్మూలమై పోయింది.


మరికొన్ని వారాలలో ఫిబ్రవరి 12వ తేదీ ఆరంబోలి వద్ద తంపి మళ్ళీ ఓటమికి లోనయ్యాడు


అయ్యో! అంతా పోగొట్టు
కున్నామే! కొచ్చిన్ మంత్రి
పాలియత్తు మేనన్ మాట తప్పకుండా,
సైన్యాన్ని పంపి వుంటే, వాళ్ళను
ఓడించి వుండేవాళ్ళి!


బ్రిటిష్ సేనలు తిరువనంతపురం కేసి వస్తూన్నప్పుడు, తంపి చివరిసారిగా తమ రాజును కలుసుకోవడానికి వెళ్ళాడు.
వీడ్కోలు చెప్పడానికి వచ్చాను ప్రభూ! ఇదిగో బ్రిటిష్ ప్రతినిధికి నా లేఖ. ఈ పగకు మూలకారణం నేను. తమకు తెలియకుండానే, తమ అనుమతి పొందకుండానే, నేను ఇన్ని కృత్యాలకు పాల్పడ్డానని ఇందులో తెలియజేశాను. నా మూలాన మీకు గానీ, ప్రజలకు గానీ ఎటువంటి హానీ జరగకూడదు.


అయితే, తంపి ఉత్తరం మెకాలేకు తృప్తి కలిగించలేదు.
ఈ తిరుగుబాటులో తమ నిమిత్తం లేదని రుజువు కావాలంటే, తమరే దళవాను వెతికి, ఖైదు చేయాలని మెకాలే ఆదేశించాడు.


రాజా మనుషులు తంపి కోసం అన్ని చోట్లా గాలించసాగారు. తంపి మారువేషాలలో తప్పించుకుని తిరగసాగాడు. ఆఖరికి, ఆయనా, ఆయన తమ్ముడూ మున్నడిలోని ఒక గుడిలో వున్నట్లు కనుగొన్నారు.
వెలుపల సైనికులు అడుగుల చప్పుడు వినిపిస్తున్నది కదా? నన్ను
ఖైదు చేయకూడదు. అ
నం భరించలేను!


చంపెయ్.. నన్ను!
వీలు కాదు. నా వల్ల కాదు!


తంపి బాకుతో, తన్ను తానే పొడుచుకున్నాడు. కిందపడ్డాడు గాని ప్రాణం పోలేదు. తరవాత
త్వరగా! నా తలను తెగనరుకు! పిరికివాడా!
ఇప్పుడు తమ్ముడు ఆయన ఆజ్ఞను పాటించక తప్పలేదు. అసమాన ధైర్యంతో, ఆత్మగౌరవంతో తంపి ఎలా జీవించాడో అలాగే వీరమరణం పొందాడు.




సంజయుడు పాండవులతో తన రాయబారం ముగించుకుని హస్తినాపురానికి తిరిగి వచ్చి, ధృతరాష్ట్రుడి దర్శనం చేసుకుని, "రాజా, ధర్మరాజు అధర్మమంతా నీపైనే ఆరోపించాడు. నువ్వు లోక నిందకు లోనయ్యావు. ధర్మరాజు పంపిన సందేశాన్ని రేపు సభలో అందరూ ఉండగా చెబుతాను," అని, ధృతరాష్ట్రుడి అనుమతితో ఇంటికి వెళ్ళిపోయాడు.

సంజయుడు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కార్యాలోచనకు పిలిపించాడు. విదురుడు రాగానే ఆయన, "పాండవుల వద్దనుంచి సంజయుడు వచ్చి వెళ్ళాడు. నాకు నిద్ర రాకుండా వున్నది. మనస్సులో తాపంగా ఉన్నది. నా తాపం పోగొట్టే మాటలు చెప్పు," అన్నాడు.

ధృతరాష్ట్రుడికి నిద్ర రాకపోవటానికి కారణం పాండవులే అని తెలుసుకుని విదురుడు ఆయనను పెట్టవలసిన చివాట్లన్నీ పెట్టి, "రాజా, నువ్వు భూమి కోసం అబద్ధం ఆడక, వంశక్షయం కలగకుండా చూసుకో. దుర్యోధనుడి కోసం పాండవులను దూరం చేసుకున్నావు. ఇందుకు దుర్యోధనుడు భ్రష్టుడైపోవటం చూస్తావు. పాండవులను చేరదీసి, వాళ్ళు బతకటానికి కొన్ని గ్రామాలైనా ఇయ్యి. నీ కొడుకులను ఆపదలో ఆదుకునేది వాళ్ళే," అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "నేను ఎప్పుడూ పాండవులను గురించి మంచిగానే ఆలోచిస్తాను. కాని దుర్యోధనుడు జ్ఞాపకం రాగానే నా బుద్ధి మారిపోతుంది. ఇదంతా దైవయోగం. నేను ఏం చెయ్యగలను?" అన్నాడు.

మర్నాడు ఉదయం ధృతరాష్ట్రుడి సభ కిటకిటలాడుతున్నది. దుర్యోధనుడికి

**46. కర్ణుడి శపథం**



యుద్ధంలో సహాయం చేయటానికి వచ్చిన రాజులందరూ, సంజయుడు పాండవుల నుంచి తెచ్చిన సందేశం వినటానికి కుతూహలపడి సభకు వచ్చారు.

ఆ సభలోకి సంజయుడు ప్రవేశించి, అందరికీ నమస్కారాలు చేసి, "రాజన్యులారా, నేను పాండవుల దగ్గరికి వెళ్ళి వచ్చాను. వారు మిమ్మల్నందరినీ అడిగినట్టు చెప్పమన్నారు. వారంతా క్షేమంగా ఉన్నారు. వారికి నేను ధృతరాష్ట్ర మహారాజు చెప్పమన్న మాటలు చెప్పాను," అన్నాడు.

అతనితో ధృతరాష్ట్రుడు, "సంజయా, నువ్వు వెళ్ళి పాండవులకు నా సందేశం తెలిపినందుకు చాలా సంతోషం. మిగిలిన వాళ్ళు ఏమన్నదీ తరవాత వింటాం గాని, ముందు అర్జునుడు ఏమన్నాడో చెప్పు, ఈ రాజులందరూ వింటారు," అన్నాడు.

సంజయుడు ఇలా చెప్పాడు:

"అందరూ వింటూండగా అర్జునుడు ఇలా చెప్పమన్నాడు: దుర్యోధనుడు మొదలైన వాళ్ళు చాలా పాపాలు చేశారుగాని వాటికి ప్రాయశ్చిత్తం అనుభవించలేదు. యుద్ధం తలపెడితే పాపఫలం అనుభవిస్తారు. ధర్మరాజు ఎంతో క్రోధాన్ని అణచుకున్నాడు; అది బయటికి వస్తే కౌరవులు భస్మమైపోతారు. భీముడు ఒక్క గద మాత్రమే తీసుకుని కౌరవసేనలను నిర్మూలించేటప్పుడు దుర్యోధనుడు తప్పక పశ్చాత్తాప పడతాడు. నకుల సహదేవులూ, విరాట ద్రుపదులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, నేనూ విజృంభించి పోరాడుతూ ఉంటే దుర్యోధనుడికి పశ్చాత్తాపం తప్ప ఇంకేమీ మిగలదు. నేను పెద్దలందరికీ నమస్కరించి మా రాజ్యం కోసం మాత్రమే యుద్ధం చేస్తాను. పాండవులు ప్రాణాలతో ఉండగా ధృతరాష్ట్రుడి కొడుకులు మా రాజ్యాన్ని సుఖంగా ఎలా అనుభవించగలరు? ఒకవేళ యుద్ధంలో వారు మమ్మల్ని జయించగలిగితే లోకంలో ధర్మం నశించినట్టే. అలా జరగదు. యుద్ధం తప్పనిసరి అయితే ధృతరాష్ట్రుడి వంశం నిర్మూలమవుతుంది. కర్ణుడితో సహా ధృతరాష్ట్రుడి కొడుకులనందరినీ నేనే చంపుతాను. అందుచేత ఏం చేస్తారో తేల్చుకోండి."

అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో, "నువ్వు కర్ణుడి మాటలూ, శకుని మాటలూ,

దుశ్శాసనుడి మాటలూ విని చెడిపోతున్నావు. కౌరవ పాండవ యుద్ధం నివారించు. లేకపోతే నాశనం తప్పదు," అన్నాడు.

ఈ మాటకు కర్ణుడు ఆగ్రహించి, "భీష్మా, నన్ను గురించి నువ్వు అన్నమాట మరొకడు అంటే బతికి ఉండేవాడు కాడు. నేను రాజధర్మాన్ని ఏమాత్రమూ తప్పలేదు. దుర్యోధనాదులకు ఎన్నడూ, ఎలాటి ద్రోహమూ చెయ్యలేదు. యుద్ధంలో నేనొక్కణ్ణే పాండవులందరినీ జయించగలను. మొదటి నుంచీ శత్రువులుగా ఉన్న వాళ్ళతో శాంతి ఏమిటి? ధృతరాష్ట్ర మహారాజుకూ, దుర్యోధనుడికీ ఇష్టమైనదంతా నేను చేస్తాను," అన్నాడు.

అప్పుడు భీష్ముడు ధృతరాష్ట్రుడితో, "ఈ కర్ణుడు పాండవులను చంపగలనని మాటిమాటికీ పేలుతూ ఉంటాడు. పాండవులు చేసిన ఘనకార్యాలలో ఒక్కటి కూడా ఇతను చెయ్యలేదు. హీనుడూ, దుర్బుద్ధీ అయిన ఇతను పాండవులను గురించి అవమానకరంగా మాట్లాడతాడు. గోగ్రహణమప్పుడు తన తమ్ముణ్ణి అర్జునుడు చంపితే ఏం చేశాడు? ఘోషయాత్ర సమయంలో గంధర్వులు దుర్యోధనుణ్ణి పట్టుకుపోతే ఏం చేశాడు? పాండవులేగదా అతన్ని విడిపించింది. కర్ణుడు మాటల వాడేగాని చేతలవాడు కాడు. ఇతని మాటలు పాటించవద్దు," అన్నాడు.

ద్రోణుడు మాట్లాడుతూ, "భీష్ముడిచ్చిన సలహా బాగుంది. అర్జునుడు సంజయుడి ద్వారా పంపిన సందేశంలో అబద్ధం ఏమీ లేదు. పాండవులతో సంధి చేసుకో



మని నేను ఎప్పుడూ చెబుతూనే వున్నాను గదా," అన్నాడు.

భీష్మద్రోణులు చెప్పిన మాటలకు ధృతరాష్ట్రుడు ఏమీ అనక, ధర్మరాజు ఏమన్నాడని సంజయుణ్ణి అడిగాడు. ధర్మరాజుకు ఎవరెవరు యుద్ధంలో సహాయపడుతున్నారో సంజయుడు వివరించి చెప్పి, ధర్మరాజు యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడని చెప్పాడు.

కాని ధృతరాష్ట్రుడికి భీముణ్ణి తలుచుకుంటేనే వణుకు పుట్టుతుంది. సంజయుడు చెప్పిన యోధులంతా ఒక ఎత్తూ, భీముడు ఒక ఎత్తూ అని ఆయన నమ్మకం. భీముడి బలం ఎలాటిదో భీష్మ ద్రోణ కృపులకూ, తనకూ మాత్రమే తెలుసు. భీష్మ ద్రోణ కృపులు యుద్ధంలో



తప్పనిసరిగా తమ పక్షాన పోరాడతారు గాని, వారికి పాండవుల పట్ల వైరం లేదు. ఇవన్నీ తలచుకుంటే ధృతరాష్ట్రుడికి కౌరవనాశం కళ్ళ ఎదట కనపడ్డట్టయింది. అర్జునుడు ఎన్నడూ యుద్ధంలో ఓడి ఎరగడు. అతన్ని ఎదిరించే వాళ్ళు ఎవరున్నారు? కర్ణుణ్ణి నమ్మటానికి లేదు. ద్రోణుడు వయసు మళ్ళినవాడు; పైపెచ్చు అర్జునుడికి గురువు.

"యుద్ధం వల్ల కౌరవ వంశనాశనం తప్పదు. యుద్ధం చెయ్యకుండా ఉంటేనే అందరికీ క్షేమమని తోస్తున్నది. అందరూ ఒప్పుకుంటే శాంతి కోసం ప్రయత్నించుదాం," అన్నాడాయన.

ఆ మాటకు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, అన్ని చిక్కులకూ మూలకారణం నువ్వే. కురుజాంగల భూములు తప్ప మిగిలినదంతా పాండవులు నీకు జయించి ఇచ్చిన రాజ్యమే కద. అదంతా నీ సొంతం చేసుకున్నావు. అదంతా నీదేనన్న ధోరణిలో ఉన్నావు. నీ కింద ఉండిన రాజులు అనేకులు పాండవుల శక్తి గ్రహించి వారి పక్షం అయ్యారు. దుర్యోధనుణ్ణి అదుపులో ఉంచకపోతే చాలా ప్రమాదం ఉన్నది," అన్నాడు.

అప్పుడు దుర్యోధనుడు తండ్రితో, "మేము ఓడిపోతామని నీకు భయం దేనికి? మేము తప్పక గెలుస్తాము. నిన్నూ, విదురుణ్ణీ తప్ప మిగిలిన మన అందరినీ చంపించాలని కృష్ణుడి ఉద్దేశం. పాండవులు నిజంగా యుద్ధంలో గెలవగలిగితే అయిదు ఊళ్ళు ఎందుకు అడుగుతున్నారు? భీముణ్ణి చూసి నీకెందుకు అంత భయం? నా గదతో ఒక్క దెబ్బ కొట్టి భీముణ్ణి చంపగలను. భీష్ముడు ఒక్కడే పాండవ సేనలను నాశనం చెయ్యగలడు. ఆయనతోబాటు ద్రోణుడూ, అశ్వత్థామా కలిసి అర్జునుణ్ణి చంపలేరా? కర్ణుడి వద్ద ఇంద్రుడిచ్చిన శక్తి ఉన్నది. పాండవసేనలో నిజమైన యోధులు పాండవులూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ మాత్రమే. మన పక్షాన అలాటి యోధులు ఎందరో ఉన్నారు," అన్నాడు.

తరవాత అతను సంజయుణ్ణి, "పాండవుల యుద్ధతంత్రం ఏమిటి?" అని అడిగాడు. కౌరవసేనలలో ఏయే సేనలనూ, యోధులనూ పాండవపక్ష యోధులు తమ వంతుగా ఏర్పాటు

చేసుకున్నదీ సంజయుడు వివరంగా చెప్పాడు.

ఆ వివరాలు విని ధృతరాష్ట్రుడు బెంబేలు పడి దుర్యోధనుడితో, "నాయనా, యుద్ధం ఆలోచన కట్టిపెట్టు. నిన్ను అందరూ మెచ్చుకుంటారు. నువ్వు సుఖంగా బతకటానికి సగం రాజ్యం చాలు. పాండవులకు కొంత రాజ్యం ఇయ్యి. అజ్ఞానంచేత నాశనం తెచ్చి పెట్టుకోకు," అన్నాడు.

"నేను ఎవరి మాటలూ విననవసరం లేదు. పాండవులను జయించటానికి నాకు ఎవరి సహాయమూ అవసరంలేదు. కర్ణుడూ, దుశ్శాసనుడూ ఉంటే చాలు. పాండవులను మేము ముగ్గురమే చంపగలం. వాళ్ళూ మేమూ కూడా బతికి ఉండటానికి వీల్లేదు. నేను సూది మొనమోపినంత భూమి కూడా పాండవులకు ఇయ్యను," అని దుర్యోధనుడు అన్నాడు.

కర్ణుడు దుర్యోధనుణ్ణి సమర్థించి, యుద్ధ భారమంతా తాను ఒక్కడే వహిస్తాననీ, పాండవులను తానే జయిస్తాననీ అన్నాడు.

అతని మాటలు వింటుంటే భీష్ముడికి అసహ్యం వేసింది.

"కర్ణా, నీ బుద్ధి వికటించి ఇలా మాట్లాడుతున్నావు. అర్జునుడి పరాక్రమమూ, కృష్ణుడి శక్తీ తెలిసి కూడా ఎందుకిలా ప్రగల్భాలు పలుకుతున్నావు? ఇది నీచుడి లక్షణం కాదా?" అన్నాడు.

ఈమాట కర్ణుడికి అవమానకరమయింది. అతను భీష్ముడితో, "కృష్ణుడు



నువ్వు చెప్పినంత గొప్పవాడే, కాని నన్ను తూలనాడటం సహించను. నేను అస్త్ర సన్యాసం చేస్తున్నాను. నువ్వు యుద్ధరంగంలో నిలిచి ఉన్నంత కాలమూ అందులోకి అడుగు పెట్టను. నీ అనంతరం నా పరాక్రమాన్ని మిగిలిన వాళ్ళు చూస్తారు," అని సభ నుంచి వెళ్ళిపోయాడు.

భీష్ముడు వెటకారంగా నవ్వుతూ దుర్యోధనుడితో, "ఒంటరిగా శత్రువును గెలవగల మహా పరాక్రముడు అస్త్రసన్యాసం చేశాడే, యుద్ధభారం ఇప్పుడెవరు వహిస్తారు? వీడు తానొక్కడే శత్రువులను జయిస్తానంటే ఎవరు నమ్ముతారు? కాకపోయినా, జయద్రథుడూ, బాహ్లికుడూ లాటి మహాయోధుల ముందు అలా ప్రగల్భాలు పలకటం తప్పు కాదా? బ్రాహ్మడినని

చెప్పి వాడు పరశురాముడి వద్ద అస్త్రాలు సంపాదించి అధర్మానికి పాల్పడ్డాడు," అన్నాడు.

భీష్ముడిలా అన్నందుకు దుర్యోధనుడు ఆయనను నిందిస్తూ, "తాతా, పాండవులు కూడా మాలాటి వాళ్ళే, మాతోపాటు పుట్టిన వాళ్ళే. మాకు కూడా అస్త్రవిద్యలూ, యుద్ధ విద్యలూ తెలుసు. అలాటప్పుడు పాండవులే గెలుస్తారని ఎలా చెప్పావు? నేను యుద్ధంలో మీ ఎవ్వరిమీదా ఆధార పడబోవటంలేదు," అన్నాడు.

దుర్యోధనుడి యుద్ధకాంక్ష చూసి విదురుడు అతనికి ఒక కథ చెప్పాడు: ఒక బోయవాడు వలపన్నితే అందులో రెండు పక్షులు తగులుకున్నాయట. అయితే అవి భయపడక, వలతో పాటు జంటగా ఆకాశంలో ఎగిరిపోసాగాయి. వాటిని వెంబడిస్తూ బోయ వాడు నేల మీద పరిగెత్తనారంభించాడు. అది చూసి ఒక ముని, "వెర్రివాడా, ఆకాశంలో ఎగిరిపోయే పక్షులను నేలమీద వెంబడించి ఏమైనా ప్రయోజనం ఉందా?" అని అడిగాడు. దానికా బోయవాడు, "స్వామీ, ఆ పక్షులు రెండూ తమలో తాము పోట్లాడుకోనంత కాలమూ నా ప్రయత్నం వ్యర్థమే. కాని అవి పోట్లాటకు దిగగానే ఆ పక్షులూ, వాటిని కలిపి ఉన్న నా వలా కూడా నాకు దక్కుతాయి," అన్నాడు. చివరకు అలాగే జరిగింది. బోయవాడు రెంటినీ పట్టుకుని, తన వల తాను తీసుకున్నాడు.

విదురుడు దుర్యోధనుడికి ఈ కథ చెప్పి, "నాయనా, జ్ఞాతులు ఆస్తికోసం కలహించటం వల్ల సర్వనాశనం కలుగు తుంది. ఇంకొక సంఘటన చెబుతాను. మేము ఒకసారి కిరాతుల వెంట గంధమాదన పర్వతానికి వెళ్ళాం. అక్కడ భయంకరమైన లోయలో ఒక పెద్ద తేనెపట్టున్నది. ఆ తేనె తాగితే జరామరణాలుండవనీ, గుడ్డి వాళ్ళకు కళ్ళు వస్తాయనీ అక్కడి వాళ్ళు చెప్పారు. మా వెంట వచ్చిన కిరాతులు ఆ తేనె కోసం ఆశపడి, క్రూరసర్పాలు తిరిగే ఆ లోయలోకి దిగి చచ్చిపోయారు. వాళ్ళు తేనె కోసం ఆశపడ్డారేగాని, దాన్ని సాధించటంలో గల ప్రమాదం ఆలోచించ లేదు. రేపు రాజ్యం కోసం పాండవులతో యుద్ధం చెయ్యటం కూడా ఇలాటి అవివేకమే అవుతుంది," అన్నాడు.



# చందమామ కబుర్లు

## నూరేళ్ళు నిండాక ఫలించిన కోరిక!

ప్యూర్టోరికో దేశానికి చెందిన ఆనా మోలినా ఒసోరియో తన 16వ యేట పాఠశాల చదువును పూర్తి చేయలేక పోయింది. ఆమె తల్లితండ్రులకు ఆమె సంపాదన అవసరం కావడంతో సినిమా టిక్కెట్లు అమ్మడానికి వెళ్ళింది. కాని ఆమెలో చదువుకోవాలనే కోరిక తీరలేదు. ఆఖరికి 86 సంవత్సరాల తరవాత గత సంవత్సరం ఆమె స్కూలు నుంచి చదువు పూర్తిచేసి పట్టా పుచ్చుకున్నది. ఇప్పుడామె వయసు 102 సంవత్సరాలు!

## మనదేశంలోనే అధిక అక్షరాస్యులు

కేరళ, పశ్చిమ బెంగాల్ వంటి రాష్ట్రాలలో ఎక్కువగా ఉన్నప్పటికీ మన దేశం అక్షరాస్యత పరిశీలిస్తే 50 శాతం లోపే. అయితే, మిగతా దేశాలకన్నా మనదేశంలోనే ఎక్కువ మంది అక్షరాస్యులున్నారు. మనదేశంలోని మొత్తం అక్షరాస్యుల సంఖ్య 590,000,000. అంటే ఇది అమెరికా, యూరప్, రష్యా దేశాలలోని మొత్తం అక్షరాస్యుల సంఖ్యకన్నా ఎక్కువ. ఇటీవల ఢిల్లీలో జరిగిన ఒక సదస్సులో జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ డా॥ షక్టర్ ఈ విశేషాలను తెలియజేశారు. మన దేశం స్వాతంత్ర్యం పొందినప్పుడు 97 శాతం మంది స్త్రీలు నిరక్షరాస్యులే. కాని, ఈనాడు అమెరికా, రష్యాలలో వున్న మొత్తం అక్షరాస్యులకన్నా మన దేశంలో ఎక్కువ మంది అక్షరాస్యులైన స్త్రీలు ఉన్నారు. 1947 నుంచి యేటా మూడు విశ్వవిద్యాలయాల చొప్పున మనదేశంలో కొత్త కొత్త విద్యాసంస్థలు స్థాపించబడుతున్నాయి. ఒక్కొక్క విశ్వవిద్యాలయం నుంచి దాదాపు 3000,000 మంది విద్యార్థులు చదువుతున్నారు. సగటున రోజుకు ఇరవై డాక్టరేట్ల ప్రదానం జరుగుతున్నది!

## అద్భుతమైన జ్ఞాపక శక్తి!



ఐదేళ్ళ వరుణ్ అద్భుతమైన జ్ఞాపకశక్తిని ప్రదర్శిస్తు న్నాడు. మనదేశంలోని రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు ఏవేవి? ఒక్కొక్క దాని వైశాల్యం, జనాభా ఎం తెంత? అని అడిగితే చిటి కలో చెప్ప గలడు. ఒక్కొక్క రాష్ట్రంలోని జిల్లాలు ఎన్ని? అవి ఏవి? క్షణంలో చెప్పగలడు అంతేనా? ప్రపంచం మొత్తం మీద వున్న 165 దేశాల కరెన్సీలు ఏవేవి? సమస్యే లేదు. సులభంగా చెప్పగలడు! అంతే కాదు. ప్రపంచ దేశాల పతాకాలనూ, రాజధానులనూ తడుముకో కుండా చెప్పగలడు. ముఖ్యమైన చారిత్రక ఘట్టాలు జరిగిన తేదీలనూ, వాటి విశేషాలనూ చెప్పగలడు. ప్రపంచ ప్రసిద్ధి గాంచిన అంతర్జాతీయ సంస్థలు, విశ్వ విద్యాలయాలు, వాటి చిహ్నాలు అన్నీ తృటికాలంలో చెప్ప గలుగుతున్నాడీ ఒకటవ తరగతి విద్యార్థి. కేరళ రాష్ట్రానికి చెందిన విజయన్ అనే ఒక ఉపాధ్యాయుడి కుమారుడీ వరుణ్. తల్లి పేరు అజిత. రెండేళ్ళ ప్రాయంలోనే బిడ్డ అరుదైన జ్ఞాపకశక్తిని గ్రహించి, తల్లిదండ్రులు తగిన శిక్షణనిచ్చారు. క్విజ్ పుస్తకాలు చదవడ మంటే అప్పుడే ఎక్కువ ఆసక్తి కనబరుస్తాడీ ఐదేళ్ళ కుర్రాడు!

చందమామ అనుబంధం 113



మన దేశపు అందచందాలు

# కజిరంగా నేషనల్ పార్క్



ప్రసిద్ధి గాంచిన ఒంటికొమ్ము ఖడ్గమృగాలకు నిలయం కజిరంగా నేషనల్ పార్క్. మన దేశం ఈశాన్య ప్రాంతంలోని అస్సాం రాష్ట్రం బ్రహ్మపుత్ర లోయలో కర్బీ ఆంగ్ లాంగ్ కొండల పాదతలంలో దాదాపు 430 చ.కి.మీ. వైశాల్యంలో విస్తరించి వున్నదీ పార్క్. ఒకప్పుడు ఉత్తర భారతదేశమంతటా ఖడ్గమృగాలు ఉండేవి. అవి క్రమంగా నశించిపోతూ 1908 నాటికి వాటి సంఖ్య 12కు తగ్గిపోయింది. నశించిపోతూన్న ఖడ్గమృగ జాతిని రక్షించడానికి 1926వ సం॥లో ఈ పార్క్ స్థాపించబడింది. ఇప్పుడు 1600 ఖడ్గమృగాలు ఉన్నాయి.

మన దేశపు ఖడ్గమృగం 5.5 అడుగుల ఎత్తు పెరుగుతుంది. 1,800 కి.గ్రా. బరువు వుంటుంది. ఆఫ్రికా ఖడ్గమృగం అన్నిటికన్నా పెద్దది. సుమత్రా జాతివి అన్నిటికన్నా చిన్నవి. వీటి ఎత్తు 4.5 అడుగులు; బరువు 1000 కి.గ్రా. ఉంటుంది. జావా ఖడ్గమృగం చాలా అరుదైనది.

కజిరంగా మృగరక్షణాలయం చాలావరకు చిత్తడి నేలతో కూడుకున్నది. అక్కడక్కడా కంచెలు, ఫలవృక్షాలు ఉన్నాయి. ప్రకృతి అందచందాలకు నిలయమైన అరుదైన ఈ మృగరక్షణాలయం, మన దేశంలోని గొప్ప 'హైకింగ్' కేంద్రంగా కూడా పేరుగాంచింది.

పురాణకాలంనాటి రాజులు:

# పురూరవుడు

యాగాలెన్నో చేసి దేవతలను సంతృప్తి పరచిన గొప్ప రాజు పురూరవుడు. ఆయన తరచూ దేవలోకానికి వెళ్ళి వస్తూ వుండేవాడు. ఒకనాడాయనకు మార్గమధ్యంలో స్త్రీల ఆర్తనాదం వినిపించింది. కేశి అనే రాక్షసుడు ఊర్వశి, చిత్రలేఖ అనే ఇద్దరు అప్సరసలను బలవంతంగా తీసుకు వెళుతున్నాడు. పురూరవుడు ఆ రాక్షసుణ్ణి ఓడించి, అప్సరసలను సురక్షితంగా స్వర్గలోకానికి చేర్చాడు.

కొంతకాలం గడిచింది. ఒక ముని శాపం కారణంగా ఊర్వశి మానవకాంతగా భూలోకంలో కొద్ది కాలం గడపవలసి వచ్చింది. ఆమె భూలోకానికి వచ్చి పురూరవుణ్ణి చూసింది. ఆమె అతిలోక సౌందర్యానికి ముగ్ధుడైన పురూరవుడు, తనను వివాహమాడమని ఆమెను కోరాడు. అందుకు ఆమె కొన్ని నియమాలు పెట్టింది. ముఖ్యంగా తన దగ్గరున్న రెండు అందమైన లేడి పిల్లలను సురక్షితంగా కాపాడినంత కాలం తాను పురూరవుడితో కాపురం చేయడానికి సమ్మతించింది. పురూరవుడు కూడా ఆ నియమానికి అంగీకరించాడు.

వారిద్దరూ భార్యాభర్తలుగా కొంతకాలం సంతోషంగా కాపురం చేశారు. ఊర్వశి శాపకాలం ముగిసే సమయం సమీపించింది. స్వర్గంలో ఆమె లేకపోవడంతో విసుగు చెందిన ఇంద్రుడు, ఆమె ఉన్న చోటును వెదకమని గంధర్వులను పంపాడు. గంధర్వులు ఒక నాటి తుపాను రాత్రి పురూరవుడి వశంలో వున్న లేడిపిల్లలను దొంగిలించారు. నిద్ర పోతూ హఠాత్తుగా లేచి దానిని పసిగట్టిన పురూరవుడు, వాళ్ళ వెంటపడ్డాడు. కాని వాళ్ళను పట్టుకోలేకపోయాడు. నియమ భంగం కావడంతో ఊర్వశి పురూరవుణ్ణి వదిలి ఆ క్షణమే స్వర్గలోకానికి వెళ్ళిపోయింది.

ఊర్వశి వియోగాన్ని భరించలేక పురూరవుడు ఉన్మాదిలా తిరగసాగాడు. ఆయన పరిస్థితికి దేవతలు జాలిపడ్డారు. యేడాదికి ఒక్కసారి కురుక్షేత్రంలో ఊర్వశి పురూరవుణ్ణి కలుసుకునేలాగా వరమిచ్చారు. పురూరవుడి జీవితంలో మళ్ళీ ఆనందం ఉదయించింది!

ఊర్వశీ పురూరవుల వృత్తాంతంలో చాలా నిగూఢార్థాలు ఇమిడి ఉన్నాయని పండితులు చెబుతారు. దీని ఆధారంగా పలువురు కవులు పలుకావ్యాలూ, నాటకాలూ రచించారు!



# మీకు తెలుసా?

## కోసక్స్



వందలాది సంవత్సరాలకు పూర్వం – ఆసియా ఖండంలోని పెద్ద పెద్ద మైదానాల నుంచి, పచ్చిక బయళ్ళ నుంచి, కొండ ప్రాంతాల నుంచి విభిన్న జాతుల, తెగల ప్రజలు రష్యాకు వచ్చి స్థిరపడ్డారు. ఆ విధంగా వచ్చిన కోసక్స్ తెగ ప్రజలు నల్లసముద్రం సమీపంలోని అజోవ్ సముద్రంలో సంగమిస్తూన్న డాన్ నదీ తీరంలో స్థిరపడ్డారు. చాలా దృఢమైన ఒక ప్రత్యేక జాతి గుర్రాలను పెంచడంలో కోసక్స్ నేర్పరులు. గుర్రపు స్వారీలో సాటి లేని వారుగా పేరు గాంచారు. యుద్ధవీరులుగా ముఖ్యంగా అశ్వికదళ యోధులుగా కోసక్స్ ప్రపంచ ప్రసిద్ధి గాంచారు. ఈనాటికీ కోసక్స్ అద్భుతమైన గుర్రపు స్వారీ ప్రదర్శనలిస్తారు. సంగీత బృందాలు ఏర్పరచుకుని ప్రపంచవ్యాప్తంగా పాటకచేరీలు జరపడంలో కూడా కోసక్స్ ప్రసిద్ధి గాంచారు.

## ఇంద్రధనుస్సు

## జీవవృక్షం



వేప ఆకును వృక్షశాస్త్రంలో 'మీలియా అజాడి రాక్టా' అని అంటారు. మన దేశంలో ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో మతసంబంధమైన అనేక ఆచారాలలో వేపాకును చాలా కాలంగా ఉపయోగిస్తున్నారు. దుష్టశక్తులను పారదోలే శక్తి వేపాకుకు ఉందని మన పెద్దలు విశ్వసించారు. ఆ విశ్వాసంలోని సత్యాన్ని ఆధునిక విజ్ఞాన పరిశోధనలు రుజువు చేస్తున్నాయి. వేపాకు వాసన, రసం – పలు వ్యాధులను వ్యాపింపజేసే క్రిమి కీటకాలను నశింపజేస్తాయి. వేపచెట్టులోని ప్రతి భాగానికీ ఔషధ గుణాలు ఉన్నాయి. వేప చెట్టు బెరడు నుంచి తీసిన కషాయాన్ని వైద్యులు జ్వరానికి మందుగా ఇస్తారు. వేప చిగురు తింటే తల్లులకూ, పిల్లలకూ వ్యాధి నిరోధక శక్తి పెరుగుతుందని చెబుతారు. వేపచెట్టు అద్భుతమైన ఔషధ గుణాలు కలిగిన **జీవవృక్షం!**

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకంగా చెలరేగిన తిరుగుబాటు దేశమంతటా వ్యాపించింది. మొట్టమొదట కొందరు సిపాయిలు ఈ తిరుగుబాటు జరిపినప్పటికీ, ఆ తరవాత స్థానిక పాలకులూ, ప్రముఖులూ, సాధారణ ప్రజలూ ఇందులో పాలు పంచుకున్నారు. నానా సాహెబ్, ఝాన్సీ లక్ష్మీబాయి ఈ తిరుగుబాటుకు ప్రధానంగా నాయకత్వం వహించారు. ఝాన్సీ కోటను చుట్టుముట్టిన బ్రిటిష్ సైనికులు, ఒకవైపు యుద్ధం సాగిస్తూనే మరొకవైపు వెళ్ళి అక్కడ మందు గుండు సామగ్రి వున్న గిడ్డంగిని ఫిరంగులతో పేల్చివేశారు. —తరవాత]

సర్ హగ్ రోజ్ నాయకత్వంలో బ్రిటిష్ సైనికులు ఝాన్సీ కోట తూర్పు వైపున వున్న మందు గుండు సామగ్రి గిడ్డంగిని పేల్చి, ఆ చోటును మంటలపాలు చేశారు. అయినప్పటికీ కోటలోని సైనికులూ, సాధారణ స్త్రీ పురుషులూ, బ్రిటిష్ సేనలకు ఎదురు నిలిచి పోరాటం కొనసాగించారు. కోట గోడలను ఎక్కడానికి ప్రయత్నించిన నలుగురు సైనికులను కిందికి తోసి చంపారు.

కోట లోపలికి మంచినీళ్ళు సరఫరా చేసే బావిని శత్రు సైనికులు ఫిరంగులతో పేల్చి, పూడ్చివేశారు. లోపల వున్న మరొక బావి కూడా ఎండిపోయింది. రాజభవనం లోని ఒక విశాలమైన గదిలో గంగా జలం నింపిన బిందెలు కొన్ని వున్నాయి.

మరొక మార్గం కనిపించక ఆ బిందెలున్న గది తలుపులు తెరిచి, రాణి లక్ష్మీబాయి, "ఈ పవిత్ర జలంతో మన దాహం తీర్చు కుందాం. ఈ పోరాటంలో మరణిస్తే, మనకు సద్గతి కలుగుగాక!" అన్నది.

ప్రహరీ గోడను ఎక్కడానికి ప్రయత్నించిన నలుగురు బ్రిటిష్ సైనికాధికారులు కిందపడి మరణించడంతో బ్రిటిష్ సేనలు వెనక్కు తిరిగాయి.

మరునాడు రాత్రి బ్రిటిష్ శిబిరంలో ప్రస్తుత పరిస్థితి మీద చర్చలు ఆరంభమయ్యాయి. తన కింది దళనాయకుల అభిప్రాయాలు విన్న తరవాత సర్ హగ్ రోజ్ ఇలా అన్నాడు:

"మనం ఇప్పటికే మనలో సమర్థులైన చాలామంది సైనికులను కోల్పోయాము. ఒక్క ఝాన్సీ ఇంతమంది సైనికులను హతమార్చిందంటే — వివిధ ప్రాంతాలలో చెలరేగుతూన్న ఈ తిరుగుబాటును మనం ఎలా అణచగలం? ఝాన్సీలో మన జయాపజయాలను బట్టే, ఇండియాలో మన కంపెనీ భవిష్యత్తు ఆధారపడి వుంది. రేపే మనం కోటలో ప్రవేశించాలి. అంతకన్నా ముఖ్యమైన విషయం ఏమంటే — మనం రాణిని ప్రాణాలతో పట్టుకోవాలి. అదే మనకు గొప్ప విజయం కాగలదు. మిగిలిన అందరినీ హతమార్చండి. కాని, అవకాశం లభించినా రాణిని మాత్రం చంపకండి. కావాలంటే ఆమెను గాయపరచవచ్చు. కాని చంపకూడదు; ప్రాణాలతో పట్టుకోవాలి. ఆమె నోటిగుండా, జరిగిన వాటికి క్షమాణలు చెప్పించాలి. ఆమె



ప్రాణభిక్ష వేడుకునేలా చేయాలి. మిగిలిన స్థానిక పాలకులందరికీ అది చక్కని గుణపాఠమవుతుంది. ఆమెను ప్రాణాలతో తెచ్చిన వారికి గొప్ప బహుమతి ఇస్తాం!"

ఇలా బ్రిటిష్ శిబిరంలో చర్చలు జరుగుతూన్న సమయంలోనే, కోట లోపల కొందరు ప్రముఖులు రాణిగారిని చూడడానికి వెళ్ళారు.

ఆ సమయంలో రాణి గాయపడిన వారికి చికిత్స చేస్తున్నది. వచ్చిన ప్రముఖులు రాణికి నమస్కరించి, "తల్లీ! ఇది ఏమాత్రం ఆలస్యం చేయతగిన సమయం కాదు. రేపు ఆ పరదేశీయులు మన కోటలోకి తప్పక జొరబడతారు. మందుగుండు సామగ్రి లేకుండా ఆ దుండగుల దురాక్రమణను ఎదుర్కోవడం అసాధ్యం. మన



దేశంలోని ఏ రాజూ, రాణీ చేయని సాహస కార్యాన్ని తమరు చేశారు. తమరు శత్రువుల చేజిక్కడం మాకు బాధాకరం!" అన్నాడు వచ్చిన ప్రముఖులలో ఒక వృద్ధుడు.

"అంటే, నేను మాతృభూమి రక్షణ కోసం వీరమరణం పొంది, కీర్తి గాంచడం మీకు అసూయగా వుందా?" అన్నది రాణి ఆప్యాయంగా.

"తల్లీ! ఇలా అంటున్నందుకు తమరు క్షమించాలి. ఈ దేశంలో మునుముందు ఎందరో వీరపురుషులు, వీరవనితలు జన్మించవచ్చు. కానీ, తమకు సాటి రాగల వీరనారీమణి ఈ గడ్డమీద మరి జన్మిస్తుందని మేము భావించడం లేదు. తమరు మరణానికి కించిత్తు కూడా భయపడరని మాకు బాగా తెలుసు. అయితే, పరమ కిరాతకులైన బ్రిటిష్ సైనికులు తమరిని ప్రాణాలలో పట్టుకుని అవమానించగలరేమో అన్న అనుమానం మమ్మల్ని వేధిస్తున్నది!" అన్నాడు ఆ వృద్ధుడు.

రాణి తలపంకించి, కొంతసేపు కళ్ళు మూసుకుని ఆలోచించింది. ఆ తరవాత ఆమె కళ్ళు తెరిచి, "అవును, మీరన్నది కూడా నిజమే. మీ సలహాను పాటించడమే మంచిదనుకుంటాను. నేను ఇక్కడి నుంచి తప్పించుకోవాలి. అది కేవలం నా ప్రాణ రక్షణకు మాత్రమే కాదు; మన పోరాటాన్ని కొనసాగించడానికి ఇతర ప్రాంతాలలో మరికొంత సైనికబలాన్ని సమీకరించుకోవడానికి కూడా అది అవకాశమిస్తుంది!" అన్నది సాలోచనగా.

"నానా సాహెబ్, తాంతియాతోపే సమయానికి వచ్చి వుంటే ఇక్కడి పరిస్థితులు ఇంత దారుణంగా పరిణమించి వుండేవి కావు. ఇప్పుడు మేము ఆఖరి క్షణం వరకు పోరాడి ఝాన్సీ పతాకను నిలబెట్టడం తప్ప మరొక మార్గం కనిపించడం లేదు," అన్నారు ప్రముఖులు.

వెనువెంటనే రాణి కోట నుంచి తప్పించుకోవడానికి కావలసిన ఏర్పాట్లు జరిగాయి. రాణిగారి గూఢచారులు వెళ్ళి తిరిగి వచ్చి, కోట దరిదాపుల్లో కంపెనీ సైనికులు లేరని చెప్పారు.

దత్తపుత్రుడయిన పసిబిడ్డ దామోదర్‌ను రాణి వీపుకు కట్టుకున్నది. ఇద్దరు పరిచారికలూ, కొందరు అంగరక్షకులూ వెంటరాగా ఆ చీకటి రాత్రిలో ఆమె తన కోటను వదిలిపెట్టింది. ఎక్కడి నుంచో

వ్యాపారం కోసమని వచ్చిన కంపెనీ దురాశ, కన్నుగానని రాజ్యకాంక్ష కారణంగా ఝాన్సీరాణి లక్ష్మీబాయి తనకు సొంతమైన కోటను అర్ధరాత్రివేళ వదిలిపెట్టవలసి వచ్చింది!

★ ★ ★

పథకం ప్రకారం మర్నాడు తెల్లవారక ముందే బ్రిటిష్ సేనలు ఝాన్సీ కోటను చుట్టుముట్టాయి. కోట లోపలి వాళ్ళు ప్రాణాలకు తెగించి ఎదురు తిరిగి పోరాడారు. వాళ్ళ ధైర్యం శత్రువులకు సైతం ఆశ్చర్యం కలిగించింది. ఒక యువకుడు కోట పైభాగం నుంచి అమాంతం ఒక దళనాయకుడి భుజాల మీదికి దూకాడు. ఆ తోపుకు దళనాయకుడు కింద పడడంతో యువకుడు కత్తిని పైకెత్తి వాడి తలను తెగనరికాడు. మరుక్షణమే మరొక సైనికుడు పేల్చిన తుపాకీ తూటాకు ఆ యువకుడు బలి అయ్యాడు.

ఆ తరవాత కొందరు సైనికులు కోట గోడల నెక్కి లోపలికి దిగి, అటువైపు నుంచి తలుపులు తెరిచారు. బ్రిటిష్ సైనికులు కోట లోపలికి జొరబడ్డారు.

తుపాకీ గుండ్లకు గాయపడ్డ ఒక స్త్రీ, పరిగెత్తుకుంటూ వచ్చి శత్రు సైనికుడి ముఖం మీద ఉమ్మింది. అంతలోనే మరి కొన్ని తూటాలు దూసుకు వచ్చి, ఆమెను నేలకు ఒరిగేలా చేశాయి!

ఎనభైయేళ్ళ వృద్ధుడి మీదికి ఒక బ్రిటిష్ సైనికుడు తుపాకీని గురిపెట్టాడు. ఆ వృద్ధుడు ఒక్క గెంతున వెళ్ళి, ఆ తుపాకీ గుండు తన రొమ్మును ఛేదించేలోగా, గురిపెట్టిన వాడి గొంతు నులిమి చంపాడు!



కోట లోపలి స్త్రీ పురుషులు తమ వద్ద ఆయుధాలు లేక పోయినప్పటికీ, చేతికి దొరికిన వాటిని తీసుకుని శత్రువుల మీదికి ఉరికారు. కాని కొంతసేపటికి చాలామంది హతులయ్యారు. కొందరు ప్రాణాలతో శత్రు సైనికులకు పట్టుబడ్డారు. అలా పట్టుబడిన వారిని బ్రిటిష్ అధికారులు, వేధించి, "మీ రాణి ఎక్కడ దాక్కుని వున్నదో చెప్పండి!" అని బెదిరించి అడిగారు.

వాళ్ళు కోపావేశంతో, "మీ శవాలను పాతి పెట్టడానికి గోతులు తవ్విస్తున్నది!" అన్నారు.

ఆ మాటతో ఆగ్రహం చెందిన బ్రిటిష్ సైనికులు అక్కడి వాళ్ళందరినీ చంపేశారు. అయినా వాళ్ళకు తృప్తి కలగలేదు.

ఎందుకంటే వాళ్ళు రాణిని పట్టుకోలేకపో యారు. కోటలో సందు గొందులన్నీ వెతికారు. కనిపించిన ప్రతి భోషాణాన్నీ తెరిచి చూశారు. గాదెలలో వెతికారు. ఆఖరికి ఒక సైనికుడు రాణి దాక్కుని వుండవచ్చన్న అనుమానంతో ఒక పాడుపడ్డ బావిలోకి దిగి వెతికాడు. అక్కడ రాణి కనిపించలేదుగాని, వాడు పాము కాటుకు గురై చచ్చాడు!

రాణి కనిపించలేదన్న ఆవేశంతో బ్రిటిష్ సైనికులు నగరంలోని సాధారణ ప్రజలను చంపడం మొదలుపెట్టారు. ముసలివాళ్ళనూ, పసిపిల్లలనూ కూడా వదిలిపెట్టలేదు. ఇళ్ళను దోచుకుని తగుల బెట్టారు. నగరమంతా మంటలకు ఆహుతై పోయింది.

ఆ చీకటి రాత్రే రాణి లక్ష్మీబాయి, కల్పీకి బయలుదేరింది. ఝాన్సీ కోటకు కొద్ది దూరంలో నిర్మానుష్యంగా వున్న ఒక భవనంలో బోకర్ అనే ఒక దళనాయకుడు కొంత సైన్యంతో వుంటున్నాడు. బోకర్ భవనం వెలుపలికి వచ్చినప్పుడు ఎవరో వేగంగా గుర్రం మీద వెళ్ళడం చూశాడు. ఆమె రాణి అయి వుంటుందన్న అనుమానం అతనికి కలిగింది. రాణిని ప్రాణాలతో పట్టుకున్న వారికి గొప్ప బహుమతి ఇస్తామన్న హ్యూరోజ్ ప్రకటన అతనికి గుర్తుకు వచ్చింది. అతనిలో ఆశపుట్టింది. పారిపోతూన్న వారిని పట్టుకోవాలని నిశ్చ యించాడు. అక్కడున్న సైనికులను తన వెంట రమ్మని ఆజ్ఞాపించి, అతడు గుర్రం మీదికి ఎక్కి వేగంగా ముందుకు ఉరికాడు. కొంతసేపటికి అతడు రాణి గుర్రాన్ని సమీ పించి, "ఆగు!" అని అరిచాడు.

రాణి క్షణంలో తన గుర్రాన్ని మెరుపులా వెనక్కు తిప్పి, బోకర్ మీదికి ఉరికింది. ఎడమ చేత్తో గుర్రం కళ్ళాన్ని లాగి పట్టి, కుడిచేత్తో కత్తి దూసి బోకర్‌ను ఒక్క వేటుతో తెగనరికింది! బోకర్ అతి భీకరంగా అరుస్తూ గుర్రం పైనుంచి కిందికి పడి పోయాడు. రాణి గుర్రాన్ని అదిలించి తన ప్రయాణాన్ని మరింత వేగంగా ముందుకు సాగించింది.

బోకర్ వెంటవచ్చిన సైనికులు నెత్తు రోడుతూ కిందపడి వున్న తమ నాయకుణ్ణి పైకి లేవనెత్తారు. —(ఇంకావుంది)





# వివేకవంతుడు

చాలాకాలం క్రితం కోసలరాజ్యాన్ని, మానసికంగానేకాక, శారీరకంగా కూడా దుర్బలుడైన సుమంతుడనే రాజు పాలించేవాడు. సుమంతుడి తాతతండ్రులు అత్యంత సమర్థులు, సాహసవంతులు. వాళ్ళు కొన్ని అపూర్వశక్తులు సంపాదించి పెట్టి, వాటి సాయంతో రాజ్యపాలన చెయ్యమని, సుమంతుడికి హితవు చెప్పి పోయారు. అయితే, సుమంతుడు ఏనాడూ ఆ అపూర్వ శక్తుల జోలికి వెళ్ళలేదు. అందుకు కారణం, దుర్బలుడైన సుమంతుడికి వాటిని ఉపయోగించుకునే వివేకం లేకపోవడమే!

కొంత కాలానికి సుమంతుడు మరణించాడు. దానికి ముందాయన, తన ఇద్దరు కొడుకులనూ చేరబిలిచి, "నాయనలారా! నేను అన్నిటా దుర్బలుడైన కారణంగా, నా జీవితం నిరర్థకమైంది. రాజుగా కీర్తి గడించలేకపోయాను. మీ తాతలు సంపాదించిపెట్టిన అపూర్వశక్తులు వుండి కూడా, ప్రజల్ని సుఖపెట్టలేక పోయాను. నాలా కాక మీరైనా ఆ అపూర్వ శక్తులను ఉపయోగించుకుని, సమర్థవంతంగా పరిపాలించండి. ఇక్కడికి ఉత్తరాన ఆమడ దూరంలో వున్న కీకారణ్యం ఆవలి అంచున ఎర్ర కొండలున్నాయి. ఆ కొండలకు తూర్పు భాగాన మన ఇష్టదైవమైన, కాళికాదేవి ఆలయమున్నదని మీకు తెలుసు. ఆ ఆలయపు గర్భగుడిలో దేవీ పాదాల చెంత కుంకుమ భరిణెను పోలిన మీట వున్నది. దానిని బలంగా నొక్కితే, నేలమాళిగకు మార్గం గోచరిస్తుంది. ఆ నేలమాళిగలో మంత్రించిన బియ్యమూ, పంచభక్ష్యాలను అక్షయంగా ఇచ్చే కంచు పాత్రా వున్నాయి. ఆ బియ్యాన్ని తెచ్చి కాళీమాతను స్మరించి

మల్లవరపు మనోహరరెడ్డి



నేల మీద చల్లితే, వేలకు వేల సైన్యం పుట్టుకొస్తుంది. ఆ సైన్య సహకారంతో యుద్ధాలు చేసి, మన రాజ్యాన్ని విస్తరింపచేయండి. అక్షయ పాత్ర మహిమతో ప్రజలను ఆకలి బాధ తెలియకుండా సుఖపెట్టండి. అంతేకాదు; మరొక అద్భుతం కూడా చెబుతాను, వినండి! ఎప్పుడైనా మన రాజ్యంలో వానలు కురవక కరువూ కాటకాలూ వచ్చినప్పుడు, శుచిగా దేవీ ఉపాసన చేసి, కాళీమాత చేతనున్న ఖడ్గాన్ని తీసుకు వస్తే, ఆ ఖడ్గం మహిమ వలన వర్షాలు కురుస్తాయి. ఇంకొక ముఖ్య విషయం; మంత్రించిన బియ్యంతో పుట్టుకు వచ్చే సేనలకు భోజనం విషయంలో లోటు జరిగితే, సైన్యం తిరిగి బియ్యంగా మారిపోతుంది, జాగ్రత్త!" అని చెప్పాడు.

రాజు సుమంతుడు చనిపోగానే పెద్దవాడు రాజయ్యాడు. కొంతకాలం గడిచాక, వర్షాలు కురవక రాజ్యంలో కరువు ఏర్పడింది. రోజులు గడిచే కొద్దీ ఆకలి చావులు మొదలయ్యాయి. అలాంటి సందర్భాల్లో – కరువుభూతం అనే ఒక రాక్షసి, దానంతటదే పుట్టుకు వచ్చి, మళ్ళీ వానలు పడగానే మాయమైపోయేది. అది వున్నన్నాళ్ళూ, కరువు రోజుల్లో రాజ్యమంతటా అరాచకం సృష్టించేది.

పెద్దవాడు, మంత్రులతో సమాలోచనలు చేసి, మహిమ గల కత్తిని తెచ్చి, వర్షాలు కురిపించి, కరువులేకుండా చేయాలని నిర్ణయించాడు.

ఒకరోజున వాడు కొంత సైన్యాన్ని వెంటబెట్టుకుని కాళికాలయానికి బయలు దేరబోతూంటే చిన్నవాడు వచ్చి, "నేను కూడా తోడు రానా?" అన్నాడు.

దానికి పెద్దవాడు వెటకారంగా నవ్వి, "నాకు దారీ, గుర్రపు స్వారీ రెండూ తెలుసు. తోడంటావా? నూరు మంది సైనికులు నా వెంట వుండనే వున్నారు – ఇక నీతో అవసరం నాకేమిటి?" అని గుర్రాన్ని అదిలించి ముందుకు సాగాడు.

వాడు మూడొంతుల అరణ్యాన్ని దాటేసరికి, ఎక్కడినుంచో సుడిగాలిలా కరువుభూతం దూసుకు వచ్చి, వాళ్ళను అడ్డుకుంది. దాని ధాటికి అడవి చెట్లు అల్లల్లాడాయి. వెంటనే సైనికులు తమ చేతవున్న ఈటెలను దానికేసి విసిరి, బాణాలను ఎక్కుపెట్టి దాని మీదికి వదిలారు.

కరువుభూతం ఈటెలనూ, బాణాలనూ అడ్డుకుంటూ, "మహిమ గల కత్తిని తెచ్చి వానలు కురిపిస్తే తప్ప, నాకు చావురాదు. ఆ పని మీద బయలుదేరిన మిమ్మల్ని ముప్పతిప్పలు పెడతాను!" అంటూ, ఉఫ్‌మని నోటితో హెూరుగాలిని సృష్టించి, ఆ గాలిలో చిక్కుకుని పెద్దవాడు, వాడి సైనికులు నగర శివార్లలో వెళ్ళి పడేటట్టు చేసింది.

ఇది తెలిసి, ఆ మర్నాడు చిన్నవాడు ఒంటరిగా గుర్రం మీద కాళికాలయానికి బయలుదేరాడు. వాడు పగలంతా అరణ్యం బయటనే గడిపి, రాత్రివేళ అరణ్యాన్ని దాటాడు. అందువల్ల, గాఢ నిద్రలో వున్న కరువుభూతం, చిన్నవాడి జాడ పసిగట్టలేకపోయింది.

వాడు కాళికాలయాన్ని చేరి, కొలనులో స్నానం చేసి, భీతిగొలుపుతున్న నిలువెత్తు కాళికాదేవి విగ్రహానికి ఎంతో భక్తితో నమస్కరించి, ఆ విగ్రహం చేతిలో వున్న కత్తిని తీసుకుని రాజధానికి బయలుదేరాడు. ఆ మరుక్షణమే ఆకాశంలో మబ్బులు కమ్మి కుండపోతగా వర్షం కురవసాగింది.

అలా మూడు రోజులపాటు ఎడతెరిపి లేని వానలు కురిశాక, కత్తిని తెచ్చి యథాస్థానంలో వుంచేశాడు, చిన్నవాడు. ఆసరికి ఏర్లుపారి, చెరువులు నిండి రాజ్యమంతా జలమయమైంది. ఆ వర్షాల్లో తడిసి కరువుభూతం కరిగిపోయింది. ప్రజలు చిన్నవాడి సాహసాన్ని వేనోళ్ళ పొగిడారు.



ప్రజల్లో చిన్నవాడికి పేరు రావడం, పెద్దవాడికి కంటగింపయింది. వాడు బాగా ఆలోచించి, చిన్నవాడిని మించిన ఘనకార్యం ఏదైనా చెయ్యాలని, ఆ మర్నాడే కాళికాలయానికి బయల్దేరాడు. వాడు ఆలయాన్ని చేరుకుని, మీట నొక్కి నేల మాళిగలో వున్న అక్షయపాత్ర తీసుకువచ్చి, నగరంలో ఇలా చాటింపు వేయించాడు: "ప్రజలారా! ఆరుగాలాలూ కష్టించి పొలం పండించినా, రాత్రింబవళ్ళు శ్రమించి మీ మీ వృత్తులు సాగించినా — అంతా తిండి కోసమే గదా? ఇక నుంచి మీరు శ్రమించకుండానే పంచ భక్ష్య పరమాన్నాలు భుజించే మహత్తరావకాశాన్ని మన రాజుగారు కల్పిస్తున్నారు. అదేమిటంటే — రేపటి నుంచి మీ అందరి కోసం



కోటలో విందు భోజనం సిద్ధంగా వుంటుంది. వచ్చి భుజించి సుఖించండి!"

ఆ మరుసటి రోజు నుంచి కోటలో సంతర్పణ మొదలైంది. ప్రజలు వేళకు వచ్చి, అక్షయపాత్ర నుంచి వచ్చే విందు భోజనం తిని, పనీ పాటా లేక నిద్ర పోసాగారు. ఇలా కొంత కాలం జరిగాక, ప్రజలు సోమరిపోతులై పొద్దస్తమానం నిద్రలో జోగుతూ, చివరకు తమ గురించి కూడా తాము పట్టించుకోక పిచ్చివాళ్ళలా తయారయ్యారు.

ఈ పరిస్థితుల్లో ఒకనాడు పెద్దవాడు రాజ్యంలో పర్యటించి, ఎక్కడా వ్యవసాయంగాని, పశుపోషణగాని లేక రాజ్యం శ్మశానంలా శిథిలమై వుండడాన్ని చూసి నిర్ఘాంతపోయాడు.

వాడు మంత్రులను పిలిపించి సంప్రదిస్తే, వాళ్ళు, "ప్రభూ! మీ నిర్ణయం అనుచితం. ఈ అక్షయపాత్రవల్ల రాజ్యానికి క్షయమేకాని, ఆవగింజంత మేలు కూడా జరగదు. ప్రజల్లో కొందరు బుద్ధిమంతులు మిమ్మల్ని మతిచలించిన వాడుగా భావించి ఆగ్రహం చెందుతున్నారు. మీరు ఏదో ఒక అద్భుతకార్యం చేసి రాజ్యంలోని ప్రజల మెప్పు పొందకపోతే, కొద్ది రోజుల్లోనే వాళ్ళు, మీ తమ్ముడికి తప్పకుండా బ్రహ్మరథం పడతారు!" అన్నారు.

తమ్ముడి మాట వినేసరికి మండిపడి, వాడు అప్పటికప్పుడు అక్షయపాత్రను తీసుకుపోయి నేలమాళిగలో వుంచి అక్కడ వున్న మంత్రించిన బియ్యం తీసుకు వచ్చి నేల మీద చల్లాడు. ఆ మరుక్షణం అపారమైన సైన్యం పుట్టుకువచ్చింది.

పెద్దవాడు మంత్రుల్నీ, సైన్యాధిపతుల్నీ సమావేశపరిచి, "ఈ సైన్యంతో నేను అన్ని రాజ్యాలనూ జయించదలచాను. అందువల్ల నేను చక్రవర్తిని కావడమే గాక, మనకు అపారమైన సంపద సమకూరుతుంది. ఇరుగుపొరుగు దేశాల మీద దాడికి పథకాల్నీ, వ్యూహాల్నీ త్వరత్వరగా తయారు చేయండి. అప్పుడు ప్రజలకు నా ప్రతాపం ఎలాంటిదో తెలిసి వస్తుంది!" అన్నాడు.

పదిరోజులు గడిచి, సైనికులు పరరాజ్యాల మీదికి దాడి ప్రారంభించక ముందే, వాళ్ళ ఆహారం కోసం ఖజానాలో వున్న డబ్బంతా ఖాళీ అయిపోయింది. దిక్కు తోచక పెద్దవాడు తలపట్టుకుని, ఏమి

చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, సైన్యం అంతా క్షణంలో బియ్యంగా మారి పోయింది.

దానితో పెద్దవాడికి వెర్రెత్తినట్టయిపోయి, "నాకు ఈ రాజ్యమూ వద్దు, అది తెచ్చిపెట్టే సమస్యలూ వద్దు. తమ్ముడే వచ్చి పరి పాలన ఎలా వెలగబెడతాడో వెలగ బెట్టమనండి! నా మానాన నేనిప్పుడే విలాస మందిరానికి వెళ్ళిపోతాను," అని మంత్రు లకు చెప్పి, పారిపోతున్నంత వేగంతో వెళ్ళిపోయాడు.

ఆ వెంటనే మంత్రులూ, సైన్యాధి పతులూ చిన్నవాడి దగ్గరకు వెళ్ళి, జరిగింది చెప్పి, "మహారాజా! మీరు ఆలయానికి వెళ్ళి అక్షయపాత్రను తెచ్చి, మంత్రించిన బియ్యాన్ని సైన్యంగా మార్చి, పరరాజ్యాలను జయించి చక్రవర్తులు కండి!" అని కోరారు.

ఇందుకు చిన్నవాడు ఒప్పుకోక, "ఇప్పటి సమస్య నేను రాజ్యాలను జయించి చక్రవర్తి కావడం కాదు. అక్షయ పాత్ర కారణంగా వృత్తులు మాని సోమరులైన ప్రజల్ని తిరిగి ఆయా వృత్తులు ప్రారంభించవలసిందిగా ఆజ్ఞాపించడం. అక్షయపాత్రనూ, కాళీమాత చేతనున్న ఖడ్గాన్నీ అక్కడే వుండనిద్దాం. తిరిగి ఏదైనా కరువుభూతం తలెత్తినప్పుడో లేక పరాయి రాజులు మన దేశం మీదికి దండెత్తి వచ్చినప్పుడో – అద్భుత శక్తులు గల వాటి నుంచి ప్రయోజనం పొందుదాం," అన్నాడు.

ఇందుకు మంత్రులూ, సైన్యాధిపతులూ సంతోషించి, "అయితే, మహారాజా! ఇప్పుడు తమ ఆజ్ఞ ఏమిటి?" అని అడిగారు.

"ప్రజలు సోమరితనం మాని ఎవరి వృత్తులు వాళ్ళు ప్రారంభించవలసిందని – నా ఆజ్ఞగా దేశమంతటా చాటింపు వేయించండి. చాటింపు జరిగిన ఇరవైనాలుగు గంటల తర్వాత, ఇంకా సోమరులుగా వున్నవాళ్ళను కారాగారంలో వేస్తామని హెచ్చరించండి!" అన్నాడు చిన్నవాడు.

ఆ విధంగానే దేశమంతటా చాటింపు జరిగింది. ప్రజలు ఎవరి వృత్తులు వాళ్ళు చేబట్టారు. ఆ తర్వాత చిన్నవాడి పరి పాలనలో ఏనాడూ కరువుభూతం తిరిగి తలెత్తలేదు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100

ఈ పోటీల వ్యాఖ్యలు 1998 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



V. Peppin Mary



A. Krishnaveni

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ **మే నెల 25వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి.** ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
**చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్-600 026.**

### ఫిబ్రవరి-మార్చ్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **ఏకాంతంలో ఏమాలోచన ?**

రెండవ ఫోటో : **ఏకాగ్రతతో నృత్యసాధన !**

పంపినవారు: శ్రీమతి వి. వాణికృష్ణ

W/o, వింజమూరి కృష్ణమూర్తి, క్రియేటివ్ క్రియేషన్స్, 1-10-5, అశోక్ నగర్, హైదరాబాదు-500020 (ఆం.ప్ర)

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా:

**డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026**

Printed by B.V. REDDI at Prasad Process Pvivate Ltd., Chandamama Building, Chennai- 600 026 (India) and Published by B. VISHWANATH A REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K.Salai, Vadapalani, Chennai- 600 026 (India) Editor : NAGI REDDI.

# జల్సా జాలీ జల ప్రపంచం

## హైదరాబాద్‌లో వింత వింతల జలవిహారవనం

# ఓషన్‌పార్క్

ఆంధ్రప్రదేశ్‌లో అతిపెద్ద విహార జలవనం, అంతర్జాతీయ స్థాయికి తీసిపోని విధంగా తీర్చిదిద్దిన జలవిహార కేంద్రం. సృష్టికి ప్రతిసృష్టి వేవ్‌పూల్‌లో సముద్రపు అలలు. కని విని ఎరుగని తమాషాలు కలిగించే **కిడ్స్‌పూల్**, నీటిలో దిగకుండానే ఆహ్లాదాన్ని ఇచ్చే **రాఫ్ట్‌స్లైడ్** 60 అడుగుల ఎత్తున త్రిశంకు స్వర్గాన్ని చూపే **సూపర్‌లూప్**... ఇంకా **లేజీ రివర్, హారాకిరి, బ్రేక్ డాన్స్, బంపింగ్ కార్స్** వర్చువల్ రియాల్టీ గేమ్స్... మరింకెన్నో!

షడ్రుచుల సమ్మేళనంతో నోరూరించే రెస్టారెంట్ కూడా! మరింకెందుకు ఆలస్యం? కోట్ల ఖర్చుతో, జంటనగరాల మణిహారంగా రూపు దిద్దుకున్న ఓషన్ పార్క్‌కి పరిపూర్ణ సకుటుంబ వినోదానికి విచ్చేయండి.




**Water Wonderful World**

శంకరపల్లి రోడ్, గండిపేట్, హైదరాబాద్.
ఫోన్ : 413-33335/6

- ఉదయం 11 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు అన్ని రోజులు తెరిచి ఉంటుంది.
- బల్క్ బుకింగ్స్‌కు స్పెషల్ డిస్కౌంట్స్ • కోఠి, సికింద్రాబాద్ నుండి బస్ సౌకర్యము కలదు.

CHANDAMAMA (Telugu) May 1998 Regd. No. M. 4854/97
Registrar of News Papers, India, RN 114/57

PARLE

మరవద్దు ఆ 'జీ' తత్వం ఎప్పుడూ మనం... జీవితాంతం



జీవిత పరమార్థం ఇదేలే ఇదే

జీవితంలోని యీ దారుల్లో వేసే ప్రతి అడుగూ పరీక్షే నిజానికి. ఏ దారుల్ని అనుసరిస్తాం, వేటినుంచి విముఖులమౌతాం అవేదే మన వ్యక్తిత్వానికి గుర్తు. ఏదీ కోరకుండా, ఏమీ ఆశించకుండా, ఎవరికైనా తోడ్పడటం. నిజానికి నిజాయితీగా బతకడం అంటే యిదే. మరవద్దు ఆ 'జీ' తత్వం మనం... ఎప్పుడూ మనం, జీవిత పరమార్థం ఇదేలే ఇదే. [illegible] భారతదేశంలో అన్నింటికన్నా ఎక్కువగా కోరుకుంటున్న బిస్కట్.




• రుచికరం, నిజంగా శక్తిమయం. •

everest/95/PPL/108 R tl